ఓమ్ తత్ సత్

జ్ఞాన, వైరాగ్యానంద, సుబోధామృతంబగు

# లక్కవర
# వేణుగోపాల శతకము



మరియు శ్రీస్వామివారి దేవాలయ బాహ్యాంత
రార్థవర్ణనయు శ్రీ మంగెనవారి వంశా
వళి వర్ణనయు గలవు.

రచయిత

శ్రీ భగవత్కవి

## లక్కాకుల వేంకట్రత్నాఖ్యదాస్

ఇది

లక్కవరపురవాస్తవ్యులును, సకలగుణసంపన్నులును శాంత
శమదమాదిధర్మ సత్యవ్రత నిష్ఠులగు
శ్రీయుత మంగెన గురయ్య బ్రదర్సు వారి
ధనసహాయమున

---

రాజోలు
శ్రీరాధాకృష్ణా ముద్రాక్షరశాలలో
ముద్రించి గ్రంథకర్తచే ప్రకటింపబడెను.

మొదటికూర్పు
1000 ప్రతులు.

1937

# భగవద్గీత సంకీర్తన యను శ్రీకృష్ణ నవరత్నమాలా

## నిత్యస్తోత్రపాఠము

:o.

శ్లో॥ సర్వోపనిషదోగావో దోగ్ధా గోపాలనందనః। పార్థోవ
త్సస్సుధీర్భోక్తా దుగ్ధంగీతామృతంమహత్॥

తా॥ ఉపనిషత్తులన్నియును గోవులు। పాలుపితుకువాడు గోపాలనందనుడగు శ్రీకృష్ణపరమాత్మ। అర్జునుడు గోవత్సము గొప్పదగు గీతామృతమే (పాలు) దీనిని త్రాగి అనుభవించువారు బుద్ధిమంతులు.

## (గీతాస్మరణానందము)

గీతాస్మరణానందమ్। పాతకహరణానందమ్। క్షితికిది బ్రహ్మానందంబను శ్రీఖ్యాతిగ పరమార్థ భగవత్॥గీతా॥

శ్రీకృష్ణార్జునసంవాదమ్। శ్రీకర నుతకృష్ణార్జునసత్ప్రియదమ్। నీలోకత్రయ సుబోధ్యమ్ లోకాలోక పవిత్రమ్ శ్రీప్రబోధ్యమ్॥గీతా॥

ఉపనిషద్రహస్యానిర్దిష్టమ్ శ్రీ। ఉపదేశామృతసత్కృత్యమ్। నాపద్బాంధవశ్రీకృష్ణుం డీప్రాపనిమనకూను పదిష్టమ్ స్పష్టమ్॥గీతా॥

అద్వైతామృతవర్షం। అష్టదశాధ్యాయాలా ఘనహర్షమ్। సద్యశతాభవనిర్మోచన్। నిత్యత్వంబీస్వత్ప్రకాశకమా॥గీతా॥

సంసారామలవిమోచన్। మహావ్యాసోభగవాన్ ఋషిసద్వచనమ్। జలస్నానాదినదినమలనిర్మోచన్। సకృద్గీతాంభసిస్నానమ్ సంస్మరన్॥గీతా॥

ఓమ్ తత్సత్

భక్తి, జ్ఞాన, వైరాగ్యానంద సుబోధామృతంబగు

లక్కవర

# శ్రీ వేణుగోపాలశతకము

ఇందు

శ్రీస్వామివారి వర్ణనయు, శ్రీమంగెనవారి వంశావళి

వర్ణనయు శ్రీ భగవద్గీత సంకీర్తనయు గలవు



రచయిత

శ్రీ భగవత్కవి:

లక్కాకుల వేంకటరత్నాఖ్యదాస

లక్కవరపురవాస్తవ్యులును, శ్రీమంతులును అగు

శ్రీయుత మంగెన గురయ్య, వేంకటనృసింహమూర్తిగార్ల

ధనసహాయమున

రాజోలు

శ్రీరాధాకృష్ణ ముద్రాక్షరశాలలో ముద్రించి

గ్రంధకర్తచే ప్రకటింపబడియె.



1937

# దయతో పండితవర్యులొసంగబడిన అభిప్రాయములు



శ్రీరస్తు. కృతజ్ఞతాసమర్పణము.

— లక్కావర శ్రీ వేణుగోపాలశతకము. —

ఈశతకము సీసపద్యములతో శ్రీయుత లక్కాకుల వేంకటరత్న భగవత్కవిగారిచే హృద్యానవద్యముగా రచియింపఁబడియె. స్థాలీపులాక న్యాయముగాఁ బరిశీలించి కాంచితిని. భక్తిరసపరిపూర్ణములై వర్ణనీయములై పద్యములు మనోజ్ఞములుగాఁ గాన్పించెను. మరియు శ్రీమత్కస్తూరి రామచంద్రకవిచంద్ర ప్రభృతిభక్తమునీంద్రులవలనఁ బరిష్కరింపబడి వంద్యనీయములైనవి. ఈశతకపుస్తకముద్ధరించు శ్రద్ధాళువులకు నిద్ధలోకాభీప్సితమ్ములెల్లఁ బ్రసిద్ధిసిదమ్ములై యిహపరసుఖమ్ములొసగుఁగాక.

కం॥ తనుధనవిభవము లచిరము
లనుసూక్తి నెఱింగి భగవ ♦ దర్పకులై ము
క్తని గందురు భగవత్కవి
వినుతగుణాతంద్రు లుర్వి ♦ వితరణసాంద్రుల్.

రాజోలు,
B. H. స్కూలు
26—8—36

ఇట్లు
యోగానందకవి.
తెలుగుపండితులు.

# A Word.

---

I have seen the Book named 'Lakkavaram Venugopala Satakam' written by Mr. Lakkakula Venkataratuakhya Kavi, who is a friend of mine from a very long time.

He has written this Book in a beautuful and simple style so that every one can easily understand. He has also written about the Mangena family who were the founders and trustees of the temple.

I am very much pleased with his style and efficiency. The outhor is noble and young man who desertes for sufficient encouragement and to publish Books of this knid I pray the Almighty to bless him with long life of prospirity.

Sri Radhakrishna Press
Razole D/8-2-'37

R. Venkanna,
Printer.

ఓమ్

శ్రీపరమాత్మనేనమః




నబోధాత్పరమంసుఖం.

శ్రీభగవత్కవి: లక్కాకుల వేంకటరత్నాఖ్యదాస్

నెల్లూరుమండలాంతర్గత, ఆత్మకూరుతాలూకా

కల్లూరుపురవరంబున జన్మస్థానము.

# తొలిపలుకు

పాఠకమహాశయులారా!

శ్రీమత్పరమపవిత్ర వశిష్ఠగోదావరీతీరంబున తూర్పు గోదావరీమండలాంతర్గత తాటిపాకసీమయననొప్పు రాజోలు తాలూకా లక్కవరపురంబున క్షీరాంబుధియందు కల్పవృక్షంబుమాడ్కి స్వచ్ఛంబగు కీర్తిప్రతిష్ఠలతోను అష్టైశ్వర్యభోగంబులతో తులదూగుచున్న శ్రీముంగెనవంశంబభివృద్ధినొందుచుండె నిట్టి వంశాంబుధిచంద్రులచే సద్భక్తిపూర్వకంబుగా జూన్ 1921 సంవత్సరమునకు సరియగు దుర్మతినామ సం॥ వైశాఖ బ ౧౦ బుధవారం ఉదయం గం॥ 8-4 లకు సరియైన ఘ ౬-౩౭ లకు ఉత్తరాభాద్రనక్షత్ర మిథునలగ్నమందు శ్రీవేణుగోపాలస్వామివారి ప్రతిష్ఠామహోత్సవము లక్కవరమున వీరిచే నిర్మించబడిన బ్రాహ్మణఅగ్రహారంబున జయప్రదముగా కొనసాగబడియె నిట్టిధర్మాత్ములగు శ్రీముంగెన సత్పురుషులచే నిర్మించబడిన శ్రీమురళీగోపాలకృష్ణాలయమును శ్రీస్వామివారిని నే నొకనాటి దివ్యసుదినంబున కన్నులపండువుగావీక్షించి బ్రహ్మానందకుతూహలాచిత్తుండనై తీర్థప్రసాదములుగైకొనిహృదయపీఠంబున శ్రీస్వామివారి దివ్యమంగళవిగ్రహమునునిలిపి (మానసిక) ధ్యానము చేయుచుంటి. నావల నీదిగువవిధంబుగా నాచిత్తంబునకు

క॥ పలికెడిది కృష్ణకథయట। పలికించెడువాడె కృష్ణ। భగ
వాన్ యటనే। పలికిన భవహరమగునట। పలికెదవేరొండు
గాథ। పలుకగనేలా॥

యనునటుల నాస్వతస్సిద్ధంబగు పలుకులుగాక శ్రీకృష్ణభగవానుడే పలికించిన పలుకులగు 180 సీసపద్యరత్నములతో నొప్పి భక్తి, జ్ఞాన, వైరాగ్యానంద సుబోధామృతంబగు లక్కవర శ్రీవేణుగోపాలశతకమను సద్గ్రంథమును లిఖించియుం

సత్యమేవజయతే॥ హరిః॥ ఓమ్॥ ధర్మమేవసుఖదమ్



శ్రీరాధారుక్మిణీ సత్యభామా సమేత శ్రీమత్ వేణుగోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః.

తూర్పుగోదావరిమండలాంతర్గత రాజోలుతాలూకా లక్కవరసత్పురంబున. శ్రీవేణుగోపాలస్వామివారి దేవస్థానధర్మకర్తలును శాంత, శమదమసత్యధర్మ స్వరూపులును సకల గుణసంపన్నులగు శ్రీమంగెనవారిసత్ప్రవర్తన.

# వంశావళి పద్యరత్నములు.

సీ॥ ఏమండలంబున♦ నింపుగాగౌతమి
ప్రవహించి సస్యముల్ ♦ ఫలమొసంగు
ఏమండలంబున♦ నీశ్వరిసద్భక్తి
భూతదమూదులు♦ పుట్టినిల్లు
ఏమండలంబున♦ శ్రీమాధవునిభక్తు
లలరుచు భజనలు♦ సలుపుచుండ్రి
ఏమండలంబున♦ నిందిరాపతిపాద
సేవనుత్సాహియిగా♦ సిరులుగండ్రి

తే॥ గీ॥ మహిమనట్టిగోదావరీ♦ మండలమున
చేరియున్నట్టిరాజవో♦ల్యెంతగలదు
పూర్ణసద్భక్తియుతులగు♦ పుణ్యపురుష
వరులనిలయంబునౌలక్క♦ వరపురంబు.

సీ॥ వేదశాస్త్రపురాణ ♦ విద్యాప్రసంగ
వివేకభాస్వరులైన ♦ విప్రవరులు
మహనీయసత్యధ ♦ ర్మపరాక్రమములచే
భుజబలోన్నతులైన ♦ భూమిపతులు
రమణీయకృషియుగో ♦ రక్షవాణిజ్యము
వరసంపదలుగల్గు ♦ వైశ్యజనులు
బ్రాహ్మణసేవాప్ర ♦ భావజ్ఞులెసుదా
సులునై మెలంగెడి ♦ శూద్రజనుల
తే॥ గీ॥ గల్గియున్నట్టి లకవర ♦ ఘనపురమున
సిరియుసంపద తేజస్సు ♦ చెలిమిగల్గి
యున్నమంగెన సద్వంశ ♦ నుత్తములగు
వీరివంశావళిని వ్రాతు ♦ వేడ్కమీర
సీ॥ క్షీరసాగరమందు ♦ చింతామణియుబోలె
మంగెనవంశమీ ♦ మహిఁజెలంగు
రమ్యమానసమున ♦ రాజహంసయుబోలె
పైడిపాల్గోత్రంబు ♦ బరగుచుండు
నట్టిగోత్రోద్భవు ♦ లధికసత్పురుషులు
సింధుగంభీరులౌ ♦ శ్రేష్ఠవంశ
మందుదయించెసు ♦ ధాబ్ధిచంద్రుడుబోలె
గంగయాఖ్యుండతి ♦ ఘనయశుండ
తే॥ గీ॥ సత్యశమదమముఖసర్వ ♦ సద్గుణుండు
పరమభక్తుండురుక్మిణీ ♦ పతికిచాల
భక్తిసుబ్బాంబ తనకాత్మ ♦ పత్నిగాగ
వేడ్కనాదంపతులుఖ్యాతి ♦ వెలసిరట్లు

## శ్రీ మంగెనవారి సద్వంశావళి.

సీ॥ పరమపుణ్యాత్ములా ♦ వరదంపతులకు శ్రీ
పతియొసంగినవర ♦ ఫలములనగ
పంచపాండవులని ♦ పంచనిర్జరకల్ప
భూజంబులని జనుల్ ♦ భువినుతింప
పరమసద్గుణరత్న ♦ పాదోధులై జని
యించిమించిరి పుత్ర ♦ పంచకంబు
బుధజనసేవయు ♦ భూతదయాదిక
ముగ్గుపాలకుగల్గె ♦ నగ్గలముగ
తే॥ గీ॥ అధికసంప్రీతి సిరివారి ♦ నాశ్రయించె
త్యాగశీలత సత్యంబు ♦ ధర్మనిరతి
బాల్యముననుండివారిక ♦ భ్యాసమయ్యె
భ్రాతృసౌహార్ద్రతయు వారి ♦ పాలిసొమ్మె
సీ॥ ఆసహజన్ముల ♦ యందు సర్వారాయు
డగ్రజుండతుల వి ♦ ఖ్యాతయశుడు
విబుధవిధేయుడా ♦ వెనుకను వేంకట
స్వామియాతనికను ♦ జన్ముడగుచు
గురుమనీషానిధి ♦ గురవయాఖ్యుండువి
శాలధీయుతుడు ము ♦ త్యాలనంగ
మరియును వేంకట ♦ నరసింహమునువంశ
రత్నంబులై కీర్తి ♦ రహిజెలంగి
తే॥ గీ॥ రటులకొంతకాలంబేగ ♦ నగ్రజుడును
వేంకటస్వామిముత్యాలు ♦ విబుధలోక
వాసులై కీర్తిశేషులై ♦ వాసిగాంచి
రహహవారి నుతింతు ♦ యవనిజనులు

సీ॥ ఘననిరాడంబర ♦ ద్విజనయవిధేయులీ
ధారుణిమంగెన ♦ వారుగారె
దీనులకును విద్య తీరుగాజెప్పించు
వారిల మంగెన ♦ వారుగారె
పండితజనులను ♦ బాగుగాపూజించు
వారియీమంగెన ♦ వారుగారె
మాతృపితృలయందు ♦ మర్యాదసమభక్తి
పరులనమంగెన ♦ వారుగారె
తే॥ గీ॥ పరమయోగ్యులు మంగెన ♦ వారుగారె
బహుళకీర్తులుమంగెన ♦ వారుగారె
ప్రథితసుగుణులు మంగెన ♦ వారుగారె
పరగగోపాలసత్కృపా ♦ పాత్రులగుట
సీ॥ శమదమశాంతాది ♦ సద్గుణంబులకెల్ల
పుట్టినిల్లగుపుణ్య ♦ పురుషులెవరో
సర్వభూతదయయు ♦ సత్యవాగ్నిరతియు
చిత్తశుద్ధియుగల్గు ♦ శ్రేష్ఠులెవరో
శ్రీవేణుగోపాల ♦ సేవాదికంబుల
సన్నుగాసల్పెడి ♦ భక్తులెవరో
నిగమోక్తముగ సర్వ ♦ నిత్యోపచారముల్
స్వామికిజరిపించు ♦ సాధులెవరో
తే॥ గీ॥ అట్టిమంగెనవంశవి ♦ ఖ్యాతులైన
చిద్విలాసులు పరమార్థ ♦ శ్రీయుతులగు
గురవయాఖ్యుండుసత్యస ♦ ద్గుణనిధియన
వేంకటనృసింహమూర్తిస ♦ ద్విమలకీర్తి

# శ్రీ మంగెనవారి సద్వంశావళి.

సీ॥ ఎవ్వరిమందిరం ♦ బిందిరాసుందరి
కందమౌచక్కని ♦ యాశ్రియంబొ
ఎవ్వారిచిత్తంబు ♦ లిద్ద సద్వర్తనం
బులకాటపట్టుగా ♦ భువిజెలంగు
ఎవ్వారిసద్భక్తి ♦ యీశ్వరసంప్రీతి
కారణంబై భువి ♦ గ్రాలుచుండు
ఎవ్వారినడువడి ♦ యెంతియునిహపర
లోకసౌఖ్యదమై ♦ పీకనొప్పు
తే॥ గీ॥ వారెమంగెన సద్వంశ ♦ వార్ధిచంద్రు
లరయ గురవయవేంకట ♦ నరహరులను
వేణుగోపాలుడతిదయా ♦ వీక్షణముల
నిందుప్రీతినికాపాడు ♦ చుండెనిరతి
సీ॥ ధనవంతులై యున్న ♦ ధాతృత్వమున్సున్న
ధాతృత్వమున్నస ♦ త్యంబుకల్ల
సత్యంబెయమరిన ♦ శాంతంబుగలుగదు
శాంతమున్ననుహరి ♦ చింతయరుదు
నిన్నియున్నను చాల ♦ సత్తమయిల్లాలు
మరియుసత్సంతతి ♦ బరగదెందు
నిట్టివృత్తులకాట ♦ పట్టుగామంగెన
సోదరులందుండె ♦ సుస్థిరముగ
తే॥ గీ॥ గనుకనేసిరిదేవికి ♦ ఘనతగాను
వీరిసంస్థానమందున ♦ వేడుకలర
శైశవక్రీడలలరారి ♦ శాశ్వతముగ
కాపురంబయ్యెగాబోలు ♦ శ్రీపురముగ

సీ॥ భద్రాద్రిద్రిగోపన్న ♦ భాతియాప్యంబుల
లెక్క జూడకనవ ♦ లీలవేల
కొలదని వెచ్చించి ♦ గోపురమంటప
ప్రాకారవాహన ♦ పరికరములతో
దివిజులుగదు మెచ్చ ♦ దేవాలయంబును
భక్త శ్రీవేణుగో ♦ పాలునకును
కట్టించియర్పించి ♦ ఘనులౌచురుక్మిణీ
పతికృపాదృష్టికి ♦ పాత్రులైరి
తే॥ గీ॥ పరమపుణ్యాత్ములైనయా ! పురుషవరుల
జన్మమెంతయుసఫలంబు ♦ సర్వవిధుల
పరమపురుషుండురుక్మిణీ ♦ పతికిగాని
యట్టిసిరియున్నవట్టిని ♦ రర్థకంబె
సీ॥ అందియుంటిరిగదా ♦ నందనందనుడగు
వరభక్తవేణుగో ♦ పాలకృతిని
కట్టించితిరిగదా ♦ ఘనతవిప్రస్థాప్య
మానగ్రహారంబు ♦ నందముగను
స్థాపించితిరిగదా ♦ శాశ్వతానందమా
దేవాలయప్రతిష్ఠ ॥ దివ్యముగను
నిర్మించితిరిగదా ♦ నిర్మలపానీయ
కూపంబులూరూర ♦ గుర్తుగాను
తే॥ గీ॥ నిలువయాధననిక్షేప ♦ నిధియనంగ
ఘనతటాకంబునిర్మించి ॥ ఘనతమెరయ
జగతినారామములుపెంచి ♦ శాశ్వతమగు
నిట్టిసప్తసంతానంబు ♦ లేర్పరచిన
పరమపుణ్యులుమంగెన ♦ వారుగాదె

# శ్రీ మంగెనవారి సద్వంశావళి.

సీ॥ మండితనాస్తిదు ♦ ర్మగము హుళక్రియ
సత్యముకున్నదు ♦ స్సంగమరుదు
కుత్సితంబిల్లెదు ♦ ర్గుణముకల్లదురాశ
లేదులోభముమిథ్య ♦ క్రోధగుణః
పాసగదెప్పుడుదుఃఖ ♦ మోహాదుష్కార్యముల్
దబ్బరమరియులే ♦ దనెడుమాట
దుర్లభము నసూయ ♦ దుష్కరమువిరోధ
మునరాదుగర్వంబు ♦ నసలెలేదు

తే॥ గీ॥ కీర్తిమిన్నందినఘనస ♦ త్కీర్తిపరులు
నిర్మలైశ్వర్యగుణరత్న ♦ నిధులనంగ
జగతిమంగెనవారికి ♦ సద్గుణంబు
లొప్పియున్నవిపరమస ♦ ర్వోత్తమముగ

సీ॥ కన్యాప్రదానాది ♦ కార్యంబులకుసాయ
పడసేసిచిత్తముల్ ♦ పరుగులిడును
నిలయముల్విప్రుల ♦ కెలమిననిర్మించి
యీయనేరికిచాల ♦ నిష్టమెపుడ
సాదరంబునపేద ♦ సాదలకన్నంబు
దగనిడుటేరిని ♦ త్యవ్రతంబు
భక్తినిశ్రీకృష్ణ ♦ పాదాబ్జసంశేవ
సల్పుటేరికిచాల ♦ సంతసంబు

తే॥ గీ॥ భూతదయయనవారికి ♦ పుట్టినిల్లు
జాతిమతభేధములులేక ♦ సర్వజనుల
ప్రీతినాగరించుటెవారి ♦ ఖ్యాతియనగ
అన్నిసద్గుణంబులెవారి ♦ కెన్నదరమె

సీ॥ సర్వభూతంబుల ♦ సమదృష్టి నెరపుచు
కరుణాంతరంగులై ♦ గనెడువారు
ఆర్యులపొడగన్న ♦ ననితసద్భక్తితో
సర్వోపచారముల్ ♦ జరుపువారు
నయనదృష్టికిపర ♦ నారులడ్డంబైన
తల్లిగాభావించి ♦ తరలువారు
మాతృపితృలభంగి ♦ మహియందుదీనుల
పరికించిదయనుగా ♦ పాడువారు

తే॥ గీ॥ సోదరులవలెహితులను ♦ జూచువారు
దైవమేయని పెద్దల ♦ దలచువారు
అన్నృతమేదశలోనైన ♦ నాడబోరు
పరమదాతలు మంగెన ♦ వారనంగ 14

సీ॥ దండిగానైశ్వైర్య ♦ ముండిమచ్చునకైన
గర్వమావంతయు ♦ గానరాము
పరిజలకుజీవనో ♦ పాయంబు జూపుచు
గన్యాయవర్తన ♦ లాదుబోరు
వ్యవహారములున్యాయ ♦ వర్తులై సలుపుచు
కుంభినీకోర్టుల ♦ గూడబోరు
కలిమియుపరువంబు ♦ గల్గియుకామాది
షడ్రిపువర్గంబు ♦ జూడబోరు

తే॥ గీ॥ కలలనైననుకల్లల ♦ బలుకబోరు
పరులకుపకారములుసేతు ♦ రరులకైన
వారిసద్వర్తనంబులె ♦ వార్థికైన
మాదదర్శనమౌను భూ ♦ మండలమున 15

సీ॥ ప్రజలక్షేమముగోరి ♦ బహుస్వల్పవడ్డీతో
పరపతులొసగెడి ♦ పావనులును
తప్పుమార్గము లేక ♦ అప్పుపత్రింబుల
తీర్మానమొనరించు ♦ ధర్మమతులు
పంటకాపులపట్ల ♦ బాగుపడగనెంచి
ఋణవిముక్తికోరెడి ♦ నిష్ఠులెపుడు
వ్యవహారములయందు ♦ న్యాయమూర్తులవలె
రక్షకులనుగాంచి ♦ గారవమున
తే॥ గీ॥ నందమునాదాయఫలితమియ్య ♦ రందుకొనగ
నొక్కభాగంబెమాకిది ♦ నొనరమీరె
రెండువంతులుననుభవిం ♦ చండి పదిల
మనిపలుకు భక్త వేంకట ♦ నరహరియును
గుగవయాఖ్యునినాజ్ఞంది ♦ గుర్తుగాను 16
సీ॥ యిట్టికార్యంబుల ♦ కిష్టులైసమకూర్చి
జనసౌఖ్యదృష్టితో ♦ ఘనసుమతియు
బావమరందియన్ ♦ భావంబుపీక్షించ
కృష్ణవిజయునిస ♦ త్కృపతోసమును
చింతల వెూరందు ♦ శ్రేష్ఠమౌకాచర్ల
గోత్రింబునన్ సత్ప ♦ విత్రమలర
గుణమెదొడ్డదనుస ♦ ద్గుణులు దొడ్డావారి
వంశాబ్ధిచంద్రుల ♦ వన్నెగాంచ
తే॥ గీ॥ నరయశేషయాఖ్యులుసర్వ ♦ మాంబకెలమి
పుత్రిరత్నంబుగానొప్పి ♦ పుణ్యమూర్తి
సరసగుణధామశుభకర ♦ చరితులైన
బాపనార్యులీసత్కార్య ♦ భక్తులగుచు
నగరసుందరి మంగెన ♦ వారికిలను 17

సీ॥ బందుగుల్ పేదలు ♦ భాగ్యవంతులటంచు
భేదంబు లేదుమ ♦ ర్యాదసమము
అభ్యాగతుడుగృహ ♦ యజమానియనియెడు
భేదంబు లేదుమ ♦ ర్యాదసమము
సేవకవర్గమా ♦ శ్రితసమూహంబను
భేదంబు లేదుమ ♦ ర్యాదసమము
పరువడిసన్నుతుల్ ♦ పిన్నపెద్దలనన్న
భేదంబు లేదుమ ♦ ర్యాదసమము
తే॥ గీ॥ మంచిగానములపొత్రిబలై ♦ మించియుండు
రహాహాయగచేతియుశిరిక ♦ కద్దమేల
కలదుశ్రీవేణుగోపాలు ♦ కరుణవారి
కెంతయునుపుణ్యంబ ♦ దెంతగలదొ 18
సీ॥ దుర్జనదూరులు ♦ నూర్జితసుజనులు
కర్జంబులకుపోని ♦ ఘనసుమతుల
సుస్థిరమంగెన ♦ సోదరులును నైక
మత్యాదిసమరస ♦ నిత్యులైన
పావనచరితులు ♦ భక్తపోషకులును
కళ్యాణశుభగుణ ♦ గౌరవులుప
రాజసతామస ♦ రాగవివర్జితుల్
సత్వగుణాధిక ♦ శాంతపరులు
తే॥ గీ॥ రమ్యలక్ష్మీకటాక్షార్హ ♦ రమణులౌచు
సకలవిద్యలనేర్చిన ♦ స్వానుభవులు
తల్లిదండ్రులయెడభక్తి ♦ దనరువారు
మిగులదోబుట్టువారిప్రే ♦ మించువారు
జగతిమంగెనవారలె ♦ సత్పురుషులు 19

సీ॥ స్థిరతరసువిచార ♦ చిత్తరంజనభక్త
సత్సంగకూటాగ్రి ♦ సమరసులును
నిస్సంగచిత్తాగ్రి ♦ నిర్మోహాస్కరమూర్ధ
తత్వబోధామృత ♦ ధార్మికులును
నిగమాంత సుమతియు ♦ నిర్మలకారుణ్య
సుజ్ఞానవేదాంత ♦ సుస్థిరులును
నిష్కామ్యయోగాఖ్య ♦ సర్వలసమదర్శ
నాత్మైక్యనిష్ఠాగ్రి ♦ నాత్మనిష్ఠు
తే॥ గీ॥ లైనముత్యాలవర్యులు ♦ నాత్మయోగి
గానవసానవేళందు ♦ ఘనతిగాని
పామరంజగుమందును ♦ బారవైచి
రామనామామృతానంద ♦ రసముగ్రోలి
స్వర్గపదమందె ధరజనుల్ ♦ సన్నుతింప 23
సీ॥ బాలప్రాయంబందె ♦ భగవంతునిజేరె
ధరనుసర్వాగ్రాయ ♦ ధర్మవేత్త
వీరికర్ధాంగియూ ♦ విమలసుజ్ఞానియు
పరమపతీవ్రత ♦ పాపమాంబ
యాతల్లికేగద ♦ యమితోపచారముల్
మాత్మదేవతకిడు ♦ రీతినొసగు
నెల్లవేళలయందు ♦ నేకోటుజేయక
మర్యాదయుక్తుడై ♦ మసలుచుండు
తే॥ గీ॥ వేంకటనృసింహమూర్తినీ ♦ వేడుకలర
నిట్టులామాతకునుసేవ ♦ నెప్పుడొసగి
పొందుచుండిరి ఘనచిదా ♦ నందపదవి
పూర్వజన్మార్జితానంద ♦ పూజవలన 24

సీ॥ రాజయోగానంద ♦ గమ్యసత్పదమందు
భక్తియోగప్రాప్తి ♦ పావనులను
అతిథినభ్యాగతి ♦ నాదరించుచుజాల
బంధుమిత్రాదుల ♦ బాగుమీర
మర్యాదలనుసల్పి ♦ మన్ననతోడుత
యిష్టార్థకామ్యము ♦ లిచ్చినపుడు
పలికిబొంకనియట్టి ♦ పరమసత్యాత్ములు
వినయవిధేయులో ♦ వేత్తలనగ

తే॥ గీ॥ గనుకసకలైహికాముష్మి ♦ కఫలములగు
నాయురారోగ్యమైశ్వర్య ♦ మష్టభోగ
పదవినొసగినశ్రీశుడు ♦ ముదముగాచు
గాకమంగెనవారికి ♦ కరుణతోడ

సీ॥ ఎవ్వరిచిత్తంబు ♦ సిద్ధసద్వర్తన 2
జనలోకసమ్ముఖ ♦ సమ్మతంబొ
ఎవ్వరినడుపడి ♦ నెలమిపూర్వాచార
పద్ధతినలరు సు ♦ బుద్ధులెవరొ
యెవ్వరిసద్భక్తి ♦ యీశ్వరసంప్రీతి
కరమగునవభవ ♦ ఘనతరంబొ
యెవ్వరిధీగాంచ ♦ నెంతొనిర్మోహమై
దైవపారాయణ ♦ దర్పితంబొ

తే॥ గీ॥ అట్టిమంగెనవారిల ♦ నమలయశులు
ఘనయదార్థవాదులునుస ♦ ద్వినయపరులు
సరసగుణుండుశ్రీయుత ♦ సత్యకీర్తి

సీ॥ సిరిసింహదలచేత◆ కరగంగనాశివా
రంపర్యభాగ్యసం◆ పాప్తివనరి
అరసిచూడగనిట్టు◆ లైదుగురుసుభాగిత
లఖిలసంత్సంపద◆ లందుచుండి
పుత్రిపౌత్రికళత్ర◆ మిత్రిసోదరబంధు
వులతోడ తులదూగి◆ వెలయుచుండి
సకలసౌభాగ్యస◆ త్సంపదలనుగాంచి
నగ్రిసంస్థానంబు◆ నందుచుండె
తే॥ గీ॥ సత్యశాంతాదిధర్మాత్మ◆ సరసులైన
పూర్వకోటీశ్వరులునౌచు◆ భోగభాగ్య
పదవులందుచు పెంచ్చగు◆ భక్తితోడ
వెలయుచుండిరిమంగెన◆ వారుయిలను. 24

సీ॥ పరమసుదర్శని◆ పత్రికభక్తియు
దేశసేవనుదెల్పు◆ దివ్యముగను
పరమసుదర్శని◆ పత్రికమరియును
తవిషయమెరిగించు◆ తథ్యముగను
పరమసుదర్శని◆ పత్రికారాజంబు
లోకవార్తలుజెప్పు◆ శ్రీకరముగ
పరమసుదర్శని◆ పత్రికరాజకీ
యసుబోధచేస్సునీ◆ వసుధకెల్ల
తే॥ గీ॥ నిట్టిసద్బోధపత్రిక◆ నిదియెగాన
శాశ్వతానందపోషక◆ సమరసులగు
పరగమంగెనసద్వంశ◆ పావనులకు
కృష్ణదేవుండునొసగును◆ శ్రేష్టపదవి. 25

సీ॥ ఒకవేళ తమయందె ♦ నుల్లాసచిత్తులై
నరుల నడతలుగాంచి ♦ నవ్వుగల్గి
నొకవేళభక్తిగా ♦ నుత్తమసద్గోష్ఠి
జరుపుచు సంతోష ♦ పరులునౌచు
నొకవేళలోఁగాంచ ♦ నున్నతదానముల్
సల్పుచుందురు చిత్త ♦ శాంతులగు
నొకవేళ హెచ్చుగు ♦ నోర్పుతోఁగూడియు
పంటభూములపట్ల ♦ పరగజనుచు

తే॥ గీ॥ గురవయాఖ్యుఁడు వేంకట ♦ నరహరియును
సర్వమీశ్వరునివిలాస ♦ సాక్షినిదియు
గాంచుమనిపల్కు నొకవేళ ♦ గారవముగ
తెనదు సహచరులిదియంత ♦ తథ్యమనుచు
మోదమందుచునుందురు ♦ సాదరముగ.

సీ॥ సత్యంబుపీక్షించ ♦ సత్యహరిశ్చంద్రు
సరితూఁగగల్గిన ♦ సత్యపరులు
ధర్మంబుపరికించ ♦ ధర్మరాజాదుల
తగబోలుచున్నట్టి ♦ ధార్మికులును
భక్తిమార్గముగాంచ ♦ ప్రహ్లాదముఖ్యుల
సగిదిగానొప్పు స ♦ ద్భక్తగుణుల
దానగుణముగాంచ ♦ దానకర్ణునిరీతి
తగుదానములనిచ్చు ♦ దాతలనగ

తే॥ గీ॥ శాంతశమదమసద్గుణ ♦ సమరసమున
భక్తుఁడాంజనేయునిసాటి ♦ రక్తిగలుగ
ధరనహింసయే పరమ స ♦ ద్ధర్మమనెడి

# శ్రీ మంగెనవారి సద్వంశావళి.

సీ|| అక్ష్మీకరుండగు । లకవర శ్రీవేణు
గోపాలకృష్ణుని ♦ కోర్కెదీర
దర్శనంబునుచేసి ♦ ధన్యుండనయ్యెద
ననితలంచియు దారి । నరుగుచుండ
మహనీయమూర్తియా ♦ మంగెన వేంకట
నరహరి సందర్శ । నములభించె
వారి కంతట మ్రొక్కి ♦ వారియాశీర్వాద
ఫలమంది యంతగో । పాలకృష్ణ

తే| గీ| సన్నిధికినేగి భక్తిసా ♦ ష్టాంగమెరిగి
స్వామిసందర్శనముచేసి ♦ సంతసించి
చిత్తమలరంగ స్తోత్రముల్ ♦ చేయ పద్య
శతకమాస్వామికర్పింప । మతియుగలిగె.

సీ|| సకలజనులుమీదు । సద్గుణములగాంచి
వినయవిధేయతా । వేద్యులగుచు
పరసవేదియుసోకి । పరగంగలోహంబు
బంగారమగునట్టి । పగిదిమరియు
శ్రీగంధవృక్షంబు । చెలువునమీదగు
సాంగత్యవాసన ♦ సమముయనుచు
తరలివస్తినిమీదు ♦ ధర్మదర్శనముకు
దివ్యసుదినమిదె । సవ్యమలర

తే|| గీ|| భగవదాజ్ఞతోపలికితి ♦ పరమకృతియు
నేనియడలను నా వశ ♦ మానెపలుక
నిట్టికృతిమీకిడితి హరి ♦ కిష్టముగను
సరస మంగెనవంశాబ్ధి ♦ చంద్రులార.

సీ॥ ధర్మక్రియాదాన ♦ ధ్యానయుతేన్ మీరు
బూర్ణాయురున్నతుల్ ♦ బొలుచుగాక
పరమేశ్వరానంద ♦ పారవశ్యంబున
విని యోగపదుభాగ్య ♦ మెనయుగాక
సజ్జనాభ్యుదయవాం ♦ ఛావృద్ధిమీకెల్ల
వృద్ధులనరచేత ♦ నెసగుగాక
దానైకదీక్షావి ♦ ధానంబునన్ మీరు
నిత్యకళ్యాణముల్ ♦ నెగడుగాక
తే॥ గీ॥ వేంకటేశ్వరుడీడు నిత్య ♦ వేడుకలను
భువిని నా చంద్రతారార్క ♦ ముందుదనుక
పొందెదరుగాక చిన్నయా ♦ నందులగుచు
సగసమంగెనవంశాబ్ధి ♦ చంద్రులార.
సీ॥ శ్రీయుశారదగారి ♦ చెలువుగామిము జేరి 3
శుభములనిడిబ్రోచు ♦ చుంద్రగాత
అంజనీసుతుడుమీ ♦ కమితబలంబిడి
కరుణతో సతతంబు ♦ గాచుగాత
విష్ణుమూర్తి యుమీదు ♦ వెన్నంటిదయతోడ
అఖిలసౌఖ్యములిచ్చి ♦ యరయుగాత
గోపాలకృష్ణుండు ♦ ప్రాపగుచున్ మీకు
గోసమితోనిపెంచ్చు ♦ గూర్చుగాత
తే॥ గీ॥ యాయురారోగ్యభాగ్యభో ♦ గ్యాభిరామ
కీర్తి భామమిముంగూడి ♦ కేరుగాత
మరుధీరత్వమునుగల్గి ♦ మెలగుడయ్య
సరసమంగెనవంశాబ్ధి ♦ చంద్రులార. 3:
సంపూర్ణము. శ్రీకృష్ణార్పణమస్తు

సత్యంవద। అహింసా పరమోధర్మః! ధర్మం చర॥



శ్రీకృష్ణ పరమాత్మాయనమః

తూర్పుగోదావరీ మండలాంతర్గత, రాజోలు తాలూకా

లక్కవర శ్రీవేణుగోపాలస్వామివారి దేవాలయ

వ ర్ణ న ప ద్య ర త్నా వ ళి.




సీ॥ శ్రీరమ్యమైయొప్పు ◆ శ్రీవేణుగోపాల
దేవాలయముగాంచ ◆ దీరుకోర్కె
సుందరతరమగు ◆ చుట్టుప్రాకారంబు
ధ్వజపీఠమును శుభ ◆ దాయకములు
కళలనుప్పొంగు శ్రీ ◆ గర్భగృహంబందు
చిత్రపంక్తియునొప్పు ◆ చిత్రముగను
ముందుభాగంబున ◆ ముఖమంటపమెగాక
మరియును కళ్యాణ ◆ మంటపంబు

తే॥ గీ॥ చూపరులకతిరమ్యమా ◆ గోపురమును
సదమలంబగు జయఘంట ◆ శబ్దములును
చిత్తరంజన మొనరించు ◆ శిఖరములను
పూజలొనరింపబెంచిన ◆ పుష్పలతల
గాంచగను నేత్రపర్వమై ◆ గ్రాలుచుండు

సీ॥ ధాటిగానొప్పుచు ◆ ద్వారబంధంబులు
ఘంటలతలుపులు ◆ గల్గియుండి

వరుసగానాట్యమౌ ♦ వాహనచయములు
వెలలేనియుత్సవ ♦ విగ్రహములు
విశదకాంతులనొప్పు ♦ వెల్లగొడుగులును
వెండివింజామరాల్ ♦ వేడ్కనొప్ప
మంజులతరమగు ♦ మకరతోరణములు
కాంతులవిశదమై ♦ గ్రమ్ముకొనగ

తే॥ గీ॥ సకలసౌభాగ్యశృంగార ♦ సంయుతంబు
మూలవిగ్రహపీఠాన ♦ ముద్దులొలుక
రుక్మిణీసత్యలకుమధ్య ♦ రూఢినొప్పి
వేణుగోపాలకృష్ణుండు ♦ వెలయుచుండు.

సీ॥ ఈదేవళంబున ♦ కిరుకెలంకులయందు
తేజరిల్లును రెండు ♦ దేవళములు
ఒకవైపుశ్రీలక్ష్మి ♦ యొకవైపు జానకీ
రామలక్ష్మణులుండు ♦ ధామములును
మధ్యభాగంబందు ♦ మహిమసత్కాంతితో
వేణుగోపాలుండు ♦ వెలయుచుండు
ద్వారంబులందున ♦ ద్వారపాలకులుండ్రి
తగశంఖచక్రముల్ ♦ దాల్చియుండి

తే॥ గీ॥ మరియుస్వామికి ప్రిద్దిశ ♦ పరమభక్తి
నైన తేయుండిడు వినయ । వందనములు

లక్కవరం శ్రీ వేణుగోపాల దేవాలయ వర్ణన

సంగదీపంబు జనులకా ♦ నందమలరు
నమరులెల్లనునుల్లాస ♦ మలరిపొగడ.

సీ॥ కృష్ణాష్టమిందు ను ♦ త్కృష్టముగజరుగ
పురవాసులెల్ల స ♦ త్పూజలంది
ధూపదీపాదులు ♦ ప్రాపగుభక్తితో
సల్పుచుందురు స్వామి ♦ సన్నిధందు
భోగపర్వంబున ♦ భోగమన్నదై శ్రీ
గోదాపరిణయంబు ♦ గూడజరుగ
ఏకాంతసేవలు ♦ నిందు ధనుర్మాస
ఉత్సవములుజర్గు ♦ నుత్తమముగ

తే॥ గీ॥ పరమసంక్రాంతియందున ♦ ద్భక్తితోడ
ధర్మకర్త వంశంబునన్ ♦ తరుణులెల్ల
కోవెలకునేగి నర్చనల్ ♦ గుర్తుగాను
జరిపి తీర్థప్రసాదముల్ ♦ చాలగొనుదు
రహహా వేణుగోపాల దే ♦ వాలయమున.

సీ॥ నిత్యభోగంబులు ♦ నిత్యార్చనలు తీర్థ
సత్ప్రసాదంబులు ♦ జరుగులెస్స
ఆనందకరముగ ♦ నష్టోత్తర సహస్ర
నామావళీపూజ ♦ నీమమొప్ప
నీశ్వరార్పణముగ ♦ నే వేళజరుగును
స్థిరమైనవసతులు ♦ సేవకులకు

వైశాఖశుద్ధాన । వరలునేకాదశి
స్వామికళ్యాణంబు । జరుగుచుండ

తే॥ గీ॥ పరమపదమగు వైకుంఠ । పట్టణంబు
పోల్కె శ్రీవేణుగోపాలు । పూజసల్పు
పరమకైంకర్య సద్భక్త । పావనులగు
ధర్మకర్తల సుగుణముల్ । తగలిఖంతు.

—o—

సత్య. ప్రేమ. కర్త

శ్రీవేణుగోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః
లక్కవర శ్రీవేణుగోపాల దేవాలయవర్ణన
ఆత్మార్థ పద్య రత్నావళి.

---

శ్లో॥ దేహో దేవాళయః ప్రోక్తో జీవోదేవః సనా
తనః త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోఽహం । భావేనపూ

| బాహ్యార్థమునకు | ఆత్మార్థమునకు |
| --- | --- |
| 1. దేహమే | 1 దేవాలయమనియు |
| 2. యీదేహములో అంతర్యామిస్వరూప సనాతనంబగు జీవుడే | 2 యీదేవాలయముః బడు దేవుడనియు |
| 3. నిత్యభోగ కైంకర్యాది సగుణార్చనయే | 3 అజపధ్యానంబ సోఽహం భావరహః తత్వజ్ఞానులు వచింత |

## లక్కవర శ్రీవేణుగోపాల దేవాలయవర్ణన.

వైశాఖశుద్ధాన । వరలునేకాదశి
స్వామికళ్యాణంబు । జరుగుచుండు

తే॥ గీ॥ పరమపదమగు వైకుంఠ । పట్టణంబు
పోల్కి శ్రీవేణుగోపాలు । పూజసల్పు
పరమకైంకర్య సద్భక్త । పావనులగు
ధర్మకర్తల సుగుణముల్ । తగలిఖింతు. 5

—o—

సత్య. ప్రేమ్. కర్తవ్య.

శ్రీవేణుగోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః
లక్కవర శ్రీవేణుగోపాల దేవాలయవర్ణనకు
ఆత్మార్థ పద్య రత్నావళి.

---

శ్లో॥ దేహో దేవాలయః ప్రోక్తో జీవోదేవః సనాతనః । త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోXహం । భావేనపూజయేత్ ।

| బాహ్యార్థమునకు | ఆత్మార్థమునకు |
|---|---|
| 1. దేహమే | 1 దేవాలయమనియు |
| 2. యీదేహములో అంతర్యామిస్వరూప సనాతనంబగు జీవుడే | 2 యీదేవాలయమున పూజింపబడు దేవుడనియు |
| 3. నిత్యభోగ కైంకర్యాది సగుణార్చనయే | 3 అజపధ్యానంబగు హంసోXహం భావరహస్యార్థంబనియు తత్వజ్ఞానులు వచింతురు. |

సీ॥ ఆత్మార్థమివరింతు ♦ నానందకరమగు
దేవాలయంబె నీ ♦ దేహమనుచు
నిట్టిదేహంబందు ♦ నెలమి సనాతన
జీవుడేగుడియందు ♦ దేవుడనుచు
సోహంము మేతను ♦ సుస్థిరనజపంబు
పూర్ణమహాదేవుని ♦ పూజయనుచు
నిది అంతరార్థంబు ♦ నిదియె వేదాంతంబు
నిభావమెరిగిన ♦ సత్యపదవి

తే॥ గీ॥ యనుచువచియింతురీ ధర ♦ నాత్మవిమలు
తేటతెల్లంబుగావీరె ♦ తెలియబడుచు
పామరులకిదె పర్వత ♦ భారమగుచు
గానబడుచుండు కృష్ణ నీ ♦ జ్ఞానమహిమ. 1

సీ॥ చిన్మయానందుడా ♦ శ్రీవేణుగోపాల
కోవెలన్ తనువందు ♦ గుర్తుగనుము
గర్భగృహంబను ♦ ఘనతరమా బ్రహ్మ
రంధ్రంబునందు శ్రీ ♦ లక్షణంబు
ప్రాకారమునుగాంచ ♦ ప్రకృతిజన్యమా
నావర్ణశక్తియా ♦ నందమలర
ఘనతమూలాధార ♦ కమలంబె ధ్వజపీఠ
మును షడ్గుణములె వా ♦ హనములనుచు

తే॥గీ॥ చిత్రదీపంబులే ఘన ♦ చిత్కళలుగ
చిత్రపంక్తియు పరమ ప ♦ విత్రమైన
తత్వములకధిష్ఠానాది ♦ దైవతములు
ప్రసిద్ధిశను ముఖమండపం ♦ బనెడి అష్ట
దళకమల మొప్పె నీక్షేత్ర ♦ తనువునందు. 2

సీ॥ మరియును భ్రూమధ్య ♦ మాంబను మంటప
మున శ్రీపరబ్రహ్మ ♦ మనెడి వేణు
గోపాలకృష్ణున ♦ కును మోక్షకాంతను
రుక్మిణీసతికిని ♦ రూఢిగాను
నైక్యసంధానమన్ ♦ యానందనిలయంబె
మహిమ శ్రీకళ్యాణ ♦ మంటపంబు
ముక్తికాంతవిలాస ♦ రక్తియానిదియని
యార్యులుసెలవిచ్చు ♦ నతులనీతి

తే॥గీ॥ ఏకదృష్టితోగాంచు సు ♦ శ్రీకరులకు
బ్రహ్మరంధ్రంబున సహస్ర ♦ పద్మమునకు
ప్రాపునగు బ్రహ్మదండియే ♦ గోపురమగు
నిదియె శిఖరంబుగనునొప్పె ♦ పదిలమలర. 3

సీ॥ హృదయపద్మంబున ♦ పదిలమౌ హోంకార
శబ్దంబెజయఘంట ♦ శబ్దములును
సోహంమమేతిను ♦ సుస్థిరపూజకు
పొలుపొందసుగుణము ♦ ల్పుష్పములుగ

దివ్యదృష్టితో గాంచు ♦ దేవాంశులకునిది
ఘనతబ్రహ్మానంద ♦ కరముగాగ
పొలుపొంద నవరంధ్ర ♦ ములు తనువందున
ధాటియా ద్వారబం ♦ ధంబులనగ

తే॥ గీ॥ దశవిధంబులనాదముల్ ♦ యశముగాను
ఘనతయా ఘంటలతిలుపు ♦ లనగమరియు
ఘననిడాపింగళ సుషుమ్న ♦ లనెడుపరమ
నుత్సవానందవిగ్రహో ♦ లుత్తమముగ
దేవామనుగుడియుందు దే ♦ దీప్యమహహా. 4

సీ॥ క్షీరసాగరమందు ♦ శేషపాన్పునవిష్ణు
శయనించినప్పుడా ♦ సర్పరాజు
తనయొక్క పడగలు ♦ ధాటిగావిప్పిన
సమతగాకుండలి ♦ శక్తియనెడు
వెల్లగొడుగులిందు ♦ వెండివింజామరా
ల్విశ్రాంతి చిత్తంబు ♦ విధమునిదియె
బ్రహ్మవిద్యయునొప్పు ♦ పావనకరమగు
మకరతోరణమయ్యె ♦ నికరముగను

తే॥ గీ॥ సకలసౌభాగ్యశృంగార ♦ సంయుతంబె
చిన్మయానంద సంపూర్ణ ♦ శ్రీకరంబు
ఘనతయా హృదయకమల ♦ మనగమూల
విగ్రహామలరుపీఠంబె ♦ వేడుకలర. 5

సీ॥ ఇట్టిపీఠంబున ♦ కుపరిభాగంబందు
ఘననిడాపింగళా ♦ లనెడి రుక్మి
ణీ సత్యలకుమధ్య ♦ నిర్మలానంద ను
షుమ్న యే శ్రీకృష్ణ ♦ సుందరుండు
దేహత్రియంబులీ ♦ దేవళాలనునట్లు
నీమూడుదేవళా ♦ లిందునమరె
సూక్ష్మశరీరంబె ♦ సుస్థిరమౌ రమా
దేవాళయంబన్యో ♦ దివ్యముగను

తే॥ గీ॥ కారణశరీరమననిందు ♦ ఘనతగాను
రామలక్ష్మణులుండు స ♦ ద్ధామమనగ
మధ్యభాగంబునను చాల ♦ మహిమయగుచు
పరగస్థూలంబె వేణుగో ♦ పాలగుడియు. 6

సీ॥ తలపసత్యంవద ♦ ధర్మంచరయనెడి
ద్వారపాలకులుండు ♦ ద్వారములును
శ్రీరామనామాక్షు ♦ రములె వీరిఘన హ
స్తంబులందున శంఖ ♦ చక్రములుగ
చిన్మయాకారుడౌ ♦ శ్రీవేణుగోపాల
పరమాత్మపై దృష్టి ♦ పావనముగ
వైరాగ్యమనెడి శ్రీ ♦ వైనతేయుండిదు
వినయవందనములు ♦ వేడుకలర

తే॥ గీ॥ ఖ్యాతిమైనట్టి శ్రీపగం ♦ జ్యోతియనెడి
నందదీపంబు జనుల కా ♦ నందమలర
నిట్టియానందమనుభవ ♦ నిత్యపరులె
సుమహితంబగు బ్రహ్మైక్య ♦ నమరులహాహా. 7

సీ॥ నిశ్చలానందంబె ♦ నిత్యభోగంబులు
నెలమనినజపంబె ♦ నిత్యపూజ
పూజాదిపాత్రలె ♦ పొలుపొందనింద్రియం
బులు గంగయమునల ♦ పూర్ణజలము
తీర్థంబుయనగను ♦ దివ్యప్రసాదంబె
ఘనతబ్రహ్మానంద ♦ మనగనొప్పె
బ్రహ్మరంధ్రంబందు ♦ పరమసహస్రార
చక్రాధిపతియగు ♦ సద్గురువుకు

తే॥ గీ॥ అర్పితంబగునీవెయ్యి ♦ హంసలిందు
యలసహస్రనామావళీ ♦ నర్చననగ
నెలమిషట్కర్మకర్మంబె ♦ నీశ్వరార్ప
ణముగ సేవకులను నింద్రి ♦ యములెనిందు
భగవదాజ్ఞానుసరణిగా ♦ పనులుచేయ. 8

సీ॥ ఈశ్వరిలాసంబు ♦ నేకాదశేంద్రియం
బునజ్ఞానదృష్టితో ♦ పూర్ణపదవి
గాంచుజ్ఞానులకును ♦ ఘనముక్తికాంతైక్య
కళ్యాణవైభవ ♦ కరణిదోచు
నిదిన్యైవైఖాన ♦ నేకాదశీపరి
ణయమునస్వామికి ♦ నయముగాను

మోక్షంబుచేరంగ ♦ దీక్షయేనిదియన
పరమాత్ముఁడనెడి గో ♦ పాలకృష్ణ

తే॥ గీ॥ పూజలేవేళజరిపెడి ♦ ముక్తిపరులు
ధర్మసత్యవ్రతులనెడి ♦ ధర్మకర్త
లనగనొప్పెనీదేవాల ♦ య మనుతనువు
నందుతత్వానుగుణాబిడా ♦ నందపదవి
పొందుచుండిరివీరె సం ♦ పూర్ణముగను.

సమాప్తము.

సత్యంవద. అహింసా పరమోధర్మః ధర్మంచర,

## —♦ ఆత్మపూజానంద సీసమాలిక ♦—



ఆత్మపూజకువేగ ♦ అంతరిపుష్పంబులు
భక్తులందరుగొని ♦ రక్తిగాను
మానసంబనెడి నీ ♦ మణులపళ్ళెరమున
అహమనుకర్పూర ♦ హారతిగొని
జ్యోతియన్ సమదృష్టి ♦ ఖ్యాతిగానిల్పుచు
సత్వగుణమనుద ♦ క్షిణయుగాగ
అజపగాయత్రిను ♦ నక్షతలందియు
లక్ష్యత్రియములే ఫ ♦ లములుగగొని

ఘనసంగమనెడి శ్రీ గంధంబుగాగొని
మననంబుయనుచుండు మంచిజలము
కామగుణంబుల గాల్చెడిధూపంబె
వేదసారంబైన వేద్యముగను
తులసిమాలికలైన త్యుత్తమసుగుణంబు
లన సాధనచతుష్ట మనెడినామ
తీర్థంబుధరియించి దివ్యమౌసాత్విక
గుణమనువస్త్రధా రణముగాగ
దశనాదములును స ద్వశమగుశృతిగల
తాళమృదంగముల్ ధాటిగాను
ఘనబ్రిహ్మవిద్యయన్ వినయంబుతోడను
హంసోహమను పర మాత్మజపమె
లక్ష్మీకరంబగు రమ్యమౌశ్రీరామ
తారకమంత్రింబు తరచుటయను
నిరువదినొకవేలు నేర్పడనార్వంద
హంసలునర్పణన్ నడుగులిడుచు
పావనకరమగు బ్రిహ్మసూత్రిమనెడి
రాజమార్గానంద తేజులగుచు
మోక్షమన్‌లకవర పురముగాంచ
జ్ఞాననేత్రిసిధాన మహానమునకె
దేహంబునకెడి సీ దేవాలయంబున
పరమాత్ముడనెడు గో పాలమూర్తి
మూడుమూర్తులకును మూలమౌనాదివి
రాట్స్వరూపంబె శ్రీ రమ్యమైన
అమ్మవారనగల్గి నాధారచక్రింబె
నందెలుగానొప్పె నందమలర

సరసస్వాధిష్ఠాన । చక్రంబైనవరత్న
వడ్డాణమనఁ నొప్పు । వాసిగాను
మణిపూర్వకంబును । మణులతో మొలనూలు
సరయుఅనాహతం । హారములుగ
ఘనతవిశుద్ధ చ । క్రంబెమంగళసూత్ర
మగుచు నాజ్ఞాచక్ర । మనెడిదివ్య
రావిరేకయునఁగ । రమ్యసహస్రార
చక్రంబెసుభకర । చరితమైన
వెయ్యిస్తంభంబుల । వేడుకమంటపం
బయ్యె శోభనకర । మైనపరమ
సుస్థిరంబనెడి సు । షుమ్నానాడియుగాంచ
అంతఃపురంబయ్యె । అమ్మకెపుడు
చిత్కళలే ఘన । చిత్రదీపంబులు
నిట్టిచందములతో । నీశ్వరియగు
మోక్షంబునందుచు । ముక్తకాంతతోఁగూడి
రతిచేయుచుందంబె । రమ్యమైన
చిన్మయానందను । శ్రీకరంబవదగు
తుర్యమనివచింతు । రార్యులెల్ల

తే॥గీ॥ తత్వమసినైక్య సంధాన । ధర్మమిట్టి
యచలమార్గదర్శనమగు । నాత్మపూజ
నెఱిగిభక్తులు లకవర । పురముచేరి
నాత్మపూజనుసల్పి శ్రీ । హరినిగనిరి
ధరను వేంకటరత్నాఖ్య । దాసపోష.

ఓమ్। తత్సత్। శాన్తిః

హరిః ఓమ్



శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః.

# లక్కవర శ్రీ వేణుగోపాల శతకము

సీ॥ శ్రీశివపుత్రుని • సేవించిపూజించి
భారతీదేవిని • బ్రస్తుతించి
శ్రీవిష్ణుచరణము • ల్చిత్తంబులోనిల్పి
సద్గురుమూర్తిని • స్తవమొనర్చి
ఇంద్రాదిద్యమర్త్యుల • నింపుగాగొనియాడి
సకలకవీంద్రుల • సన్నుతించి
వ్యాసవాల్మీకుల • వాసిగాబొగడియు
సుజ్ఞానపరులసం • స్తోత్రమిడియు

తే॥ గీ॥ చెప్పబూనితి పద్యముల్ • చిత్తగింపు
మానసచిత్తాబ్జభృంగశ్రీ • గానలోల
లక్కవరపురపాలహి • రణ్యచేల
వేణుగోపాల రుక్మిణీ • ప్రాణలోల॥

సీ॥ యతిగణ ప్రాసంబు। లరసి చూడగ లేదు
కావ్యంబు లేమియు। గాంచ లేదు
అమరగ నిఘంటువు। నసలె చూడగ లేదు
వ్యాకర్ణ శాస్త్రంబు। నరయ లేదు
వేదశ్రుతులయందు। వేడుక యే లేదు
సత్పురుషులకు సేవ। సలుప లేదు
అష్టాదశ పురాణ। దృష్టి యేమియు లేదు
షట్శాస్త్రముల యొక్క। సార మెరుగ

తే॥ గీ॥ నీదయా దృష్టి నాయందు। మిగుల గలుగ
శతకరాజంబు లిఖియింతు। శ్రద్ధతోడ
లక్ష్మీ వర॥ ......... 2

సీ॥ నందకుమారక। నవనీత చోరుండ
వసుదేవనందన। వాసుదేవ
రాధామనోహర। మాధవ గోవింద
గోపికాలోలాత్మ। గోపబాల
శ్రీకృష్ణ కేశవ। చిన్మయానందాత్మ
వాణీశజనక ని। ర్వాణదాత
కాళీయమర్దన। కంససంహారక
పార్థసారధి దేవ। పరమపురుష

తే॥ గీ॥ భక్తవత్సల పద్మాక్ష। భవవిదూర
ద్వారకా వాసదేవతా। సార్వభౌమ
లక్ష్మీ వర॥ ......... 3

సీ॥ పాహికృష్ణప్రభో। పాహిరామప్రభో
పాహిఓంకారాత్మ। పాహిపాహి
పాహివిష్ణుప్రభో। పాహిజిష్ణుప్రభో
పాహిరుక్మిణినాథ। పాహిపాహి
పాహి శౌరిప్రభో। పాహిశార్ఙ్గప్రభో
పాహిసత్యాప్రియ। పాహిపాహి
పాహిహరిప్రభో। పాహిభక్తప్రభో
పాహిరాధాలోల। పాహిపాహి

తే॥ గీ॥ పాహికమలజముఖనుత। పాహిపాహి
పాహియదుకులదీపక। పాహిపాహి
లక్ష్మీవర॥ .......... 4

సీ॥ రాధామనోహర। మాధవపరమాత్మ
పరమపదనివాస। శరణుశరణు
పార్థసారథిదేవ। భక్తసంరక్షకా
మురళీధరాశౌరి। శరణుశరణు
నారాయణాభక్త। పారిజాతద్రుమా
సర్వేశశ్రీకృష్ణ। శరణుశరణు
మందరోద్ధారగో। విందహరేకృష్ణ
పరమార్థగోవింద। శరణుశరణు

తే॥ గీ॥ శరణునీకిదెనిక్కంబు। సారసాక్ష
భక్తహృత్పద్మ సంవాస। భర్మవాస
లక్ష్మీవర॥ 5

సీ॥ శ్రీపరంధామురా♦ జీవాప్తశశినేత్ర
వైకుంఠవాసనా♦ వందనంబు
శ్రీమానినీహృత్క♦ శేశయసంచార
వసుదేవతనయనా♦ వందనంబు
సద్గుణ్యసంపన్న♦ సంరక్షితామర్త్య
నందకుమారనా♦ వందనంబు
కందర్పలావణ్య♦ కమనీయసౌందర్య
బృందావనావాస♦ వందనంబు
తే॥ గీ॥ అందమౌనీదు చరణార♦ విందములకు
విందుసల్పెదపదికోట్ల♦ వందనముల
లక్ష్మీవర॥ ......... 6

సీ. జయజయగోపాల ♦ జయజగత్పరిపాల
సర్వేశ్వరానీకు ♦ జయము జయము
జయజయగోవింద ♦ జగదేక పరమాత్మ
భయవిదూరాకృష్ణ ♦ జయముజయము
జయజయ కేశవ ♦ జగధీశ్వరానంద
సకలలోకాధార♦ జయముజయము
జయజయ మాధవా ♦ జగదేకసుందర
సత్యరూపాదేవ ♦ జయముజయము
తే॥ గీ॥ కృష్ణవిజయము నీభూరి♦కృపనుజూపు
మానిచిత్తాబ్జభృంగ భ♦క్తానుషంగ
లక్ష్మీవర...............

సీ! శ్రీకృష్ణ పరమాత్మ ♦ చిత్ప్రకాశానంద
ద్వారకానిలయ జో ♦ హారునీకు
రాధామనోల్లాస ♦ లక్ష్మీశగోవింద
శౌరిశ్రీకృష్ణ జో ♦ హారునీకు
సత్యవ్రతాచార ♦ సాధువ్రజోద్ధార
అమరసంస్తుత్య జో ♦ హారునీకు
వేదాంతసంచార ♦ విశ్వంభరాధార
అర్జునమిత్ర జో ♦ హారునీకు
తే॥ గీ॥ నాదుజోహారులెల్లను ♦ సాదరమున
నీవెగైకొని నన్నేలు ♦ నీలవర్ణ
లక్ష్మవర...... 8

సీ॥ నవరసపరమాన్న ♦ నవసలిములకన్న
కృష్ణనామామృతం ♦ కితముతీపి
పనసజంబూదాక్ష ♦ ఫలరసంబులకన్న
కృష్ణనామామృతం ♦ కితముతీపి
కదళీసు ఖర్జూర ♦ ఖండ శర్కలపై
కృష్ణనామామృతం ♦ కితముతీపి
పాలుమీగడ తేనె ♦ పానకంబులకన్న
కృష్ణనామామృతం ♦ కితముతీపి
తే॥ గీ॥ ఘనతప్రహ్లాద ముఖరులు ♦ గాంచినట్టి
కృష్ణనామామృతము ముక్తి ♦ కేవలముగ
లక్ష్మవర...... 9

సీ॥ వందనంబులు భక్త • మందార ముచుకుంద
వరదనీకివె బహు • వందనముల
వందనంబులు సర్వ • బృందారకాధ్యక్ష
వందనంబులు కరి • వరదనీకు
వందనం బిందిరా • సుందరీహృత్పద్మ
మందిరా కేశవ • వందనములు
నందనందననీకు • వందనంబులు మౌని
సందోహవందితా • వందనములు
తే॥ గీ॥ వందనార్హ్బదములు జగ • ద్వంద్యనీకు
మందరాద్రి ధరాకోటి • వందనములు
లక్కవర.......... 1

సీ॥ పుండరీకవరద • పండరీపురనాథ
జయజయవిఠ్ఠల • జగధీశ
మదనమోహనకృష్ణ • మాధవమాం పాహి
బృందావనవిహార • నందతనయ
ముద్దులగూల్పిన • ముద్దుల శ్రీకృష్ణ
మధుసూదనమురారి • మదనజనక
అండజ వాహన • పుండరీకదళాక్ష
పాండవ సంరక్ష • పాహిపాహి
తే॥ గీ॥ శ్యామసుందరదేవతా • చక్రవర్తి
అచ్యుతానంద గోవింద • హరిముకుంద
లక్కవర......... 11

సీ॥ అజముఖబృందార । కాధ్యక్షుపరమాత్మ
పన్నగశయనునీ । భజన జేతు
గజరాజ పరిపాల । కామిత సంధాయి
భక్త సంరక్షునీ । భజనజేతు
సుజనావనా భక్త । సులభదయాకర
పాపాదివర్జునీ । భజనజేతు
కుజనసంహారకా । గోవిందమురహర
భవభయనాశనీ । భజనజేతు
తే॥ గీ॥ భజనభజనంచుని భక్తి । పాటలెపుడు
పాడుచుందురు భక్తులు । పరవశమున
లక్ష్మీవర........ 12

సీ॥ నీనామకీర్తన । నిత్యంబునాల్కతో
పలుకనేర్చినవాడె । పండితుండు
నీరూపసుందర । మేకోజుచక్షుల
జూడనేర్చినవాడె । శుద్ధయోగి
నీకీర్తనాదుల । నిచ్చలుశీనుల
కందజేసినవాడె । యఘువిదారి
నీవనమాలికా । నిర్మలగంధమా
ఘ్రాణించువాడెపో । ఘనతపస్వి
తే॥గీ॥ ఫాలమూర్వినిసోకనీ । పాదములకు
మ్రొక్కనుతియించువాడెపో । ముక్తివరుడు
లక్ష్మీవర........ 13

సీ॥ వందనంబులు భక్త ♦ మందార ముచుకుంద
వరదనీకివె బహు ♦ వందనముల
వందనంబులు సర్వ ♦ బృందారకాధ్యక్ష
వందనంబులు కరి ♦ వరదనీకు
వందనం బిందిరా ♦ సుందరీహృత్పద్మ
మందిరా కేశవ ♦ వందనములు
నందనందననీకు ♦ వందనంబులు మౌని
సందోహవందితా ♦ వందనములు

తే॥ గీ॥ వందనార్బుదములు జగ ♦ ద్వంద్యనీకు
మందరాద్రి ధరాకోటి ♦ వందనములు
లక్కవర..........

సీ॥ పుండరీకవరద ♦ పండరీపురనాథ
జయజయవిఠ్ఠల ♦ జగదీశ
మదనమోహనకృష్ణ ♦ మాధవమాం పాహి
బృందావనవిహార ♦ నందతనయ
ముద్దులగుాల్పిన ♦ ముద్దుల శ్రీకృష్ణ
మధుసూదనమురారి ♦ మదనజనక
అండజ వాహన ♦ పుండరీకదళాక్ష
పాండవ సంరక్ష ♦ పాహిపాహి

తే॥ గీ॥ శ్యామసుందరదేవతా ♦ చక్రివర్తి
అచ్యుతానంద గోవింద ♦ హరిముకుంద
లక్కవర.........

సీ॥ అజముఖబృందార ॥ కాధ్యక్షపరమాత్మ
పన్నగశయనని ॥ భజనజేతు
గజరాజ పరిపాల ॥ కామిత సంధాయి
భక్తసంరక్షనీ ॥ భజనజేతు
సుజనావనా భక్త ॥ సులభదయాకర
పాపాదివర్జినీ ॥ భజనజేతు
కుజనసంహారకా ॥ గోవిందమురహార
భవభయనాశనీ ॥ భజనజేతు
తే॥ గీ॥ భజనభజనంచుని భక్తి ॥ పాటలెపుదు
పాడుచుందురు భక్తులు ॥ పరవశమున
లక్ష్మీవర........ 12

సీ॥ నీనామకీర్తన॥ నిత్యంబునాల్కతో
పలుక నేర్చినవాడె॥ పండితుండు
నీరూపసుందర॥ మేరోజుచక్షుల
జూడనేర్చినవాడె॥ శుద్ధయోగి
నీకీర్తనాదుల॥ నిచ్చలుశీనుల
కందజేసినవాడె॥ యఘవిదారి
నీవనమాలికా॥ సిగ్మలగంధమా
ఘ్రాణించువాడెపో॥ ఘనతపస్వి
తే॥గీ॥ ఫాలమున్నిదిపోకనీ॥ పాదములకు
మ్రొక్కనుతియించువాడెపో॥ ముక్తిపరుడు
లక్ష్మీవర........ 13

సీ॥ పాపజాలములన్ని । పారద్రోలెడిమందు
కృష్ణనామాక్షర । కీర్తనంబు
చావు పుట్టుక లేని । చక్కనిసిద్ధిమందు
కృష్ణనామాక్షర । కీర్తనంబు
ఆశయన్ పాశంబు । గోసివేసెడిమందు
కృష్ణనామాక్షర । కీర్తనంబు
రాగమోహాంబుల । రాలగొట్టెడిమందు
కృష్ణనామాక్షర । కీర్తనంబు
తే॥ గీ॥ అట్టినీదివ్యకీర్తనా । భ్యాసమతిగ
జేసికాపాడుమిా నన్ను । శ్రీఘ్రముగను
లక్కవర......

సీ॥ భవబంధదుఃఖముల్ । పారద్రోలగనీవె
దీనసంరక్షకా । దిక్కుమాకు
సంగత్రియాదుల । భంగంబు సల్పంగ
దేవదేవేశ్వరా । దిక్కుమాకు
దండధరునిబంట్లు । దరిజేరకుండంగ
దివ్యనామానీవె । దిక్కుమాకు
ప్రారబ్ధకర్మముల్ । భస్మమై పోవంగ
దేవసంరక్షకా । దిక్కుమాకు
తే॥ గీ॥ నీవుగాకున్న రక్షింప । నెవరుదిక్కు
అన్నిదిక్కులు నీవెమో । నన్నుతాంగ
లక్కవర.........

సీ॥ వనదాభవర్ణుండు ♦ ఘనతరసౌందర్య
లలితసద్భూషణా ♦ లంకృతుండు
నాజానుబాహుండు ♦ నబ్జపత్రాక్షుండు
పర్వేందువదనుండు ♦ భాసురుండు
గంభీరవక్షుండు ♦ ఘనకంబు కంఠుండు
మహనీయ మన్మథ ♦ మన్మథుండు
నెలవంకబొమలును ♦ నేత్రాంజనముసరి
గా సొగసైనీల ♦ కళలనీను
తే॥ గీ॥ లోకమోహనమూర్తి రా ♦ ధాకళత్రు
డనుచు భక్తులు కేరింత ♦ లాడుచుండ్రి
లక్కవర...... 16

సీ॥ సుందరాకారస ♦ న్మందలోద్ధారకా
నీలీలలనుగాంచ? జాలునెవడు
పుణ్యచారిత్రిలా ♦ వణ్యసురూపస
త్కరుణాసుధానిమ్న ♦ గాకళత్ర
వందనమదె మును ♦ లందరు నిను మొక్కి
ఘనతరపదవిని ♦ గాంచిరహహ
శ్యామసుందరనీదు ♦ కోమలపదములు
హృదయకమలమందు ♦ పదిలపఱచి
తే॥ గీ॥ చేర్చిపూజింతు గోపికా ♦ చిత్తచోర
మదనజనక దురారాతి మదవిభంగ
లక్కవర...... 17

సీ॥ వైకుంఠవాసనీ • వర్ణనల్ వినునాదు
చెవులకు దుష్కథల్ • తవులనీక
నారాయణానీదు • నామామృతముగ్రోలు
జిహ్వకుపరకథల్ • చేరనీయక
కమలాక్షనీపాద • కమలముల్ గనునాదు
కనులకుబరకాంత • గనగనీక
గోవిందనీనామ • గుణముల చింతించు
చిత్తమందజ్ఞాన • చింతనిడక
తే॥ గీ॥ నరకకూపంబులోనన్ను • నురుకనీక
పరమపదమిమ్ము త్రైలోక్య • పారిజాత
లక్కవర.......... 1

సీ॥ నారాయణానీదు • నామామృతంబెప్డు
నాలుకయందీవె • నాటరాద
దేవజగన్నాథ • దివ్యమౌ నీకీర్తి
చెవులతోవినునట్లు • చేయరావ
జగదంతరాత్మనీ • సత్యస్వరూపంబు
నేత్రంబులందెప్డు • నిలుపరాద
వసుదేవతనయనీ • వరపాదయుగళినా
చిత్తపీఠమునందు • జేర్పరాద
తే॥ గీ॥ పరమపదమబ్బునట్టి నీ • పాదభక్తి
రూఢిపడునట్లునన్నుగా • పాడరాద
లక్కవర.......... 1

సీ॥ శ్రీరమాచిత్తేశ ♦ జీమూతసంకాశ
కాలత్రయాతీత ♦ కంజనేత్ర
జగదీశ వేదార్థ ♦ సన్నుతగుణజాల
భువనసంరక్షణ ♦ పూర్ణతేజ
సాధుహృద్వాసశ్రీ ♦ రాధామనోల్లాస
లోకసంతతశుభ ♦ శ్రీకరాత్మ
సింధు గంభీరాత్మ ♦ సేవకమందార
వైకుంఠనిలయ శ్రీ ♦ వాసుదేవ

తే॥ గీ॥ ఇన్నినామంబులనుచు ని ♦ న్నెంచగలరె
సర్వనామంబులును రూప ♦ సరణులీవె
లక్ష్మీవర......... 20

సీ॥ రాధేశగోవింద ♦ రారశ్రీగోపాల
దుష్కరభవభంగ ♦ దురితదూర
పరమపురుష కృష్ణ ♦ పద్మనాభాచ్యుత
శ్రీరమాధీశసు ♦ శ్రీవిలాస
కాళీయమర్ధన ♦ కంససంహారక
దివ్యసుందరరూప ♦ దేవదేవ
కలివరదాశౌరి ♦ స్మరకోటిమోహన
దివ్యసుందరరూప ♦ దేవదేవ

తే॥ గీ॥ బాలగోపాలసురజాల ♦ భక్తపాల
భవ్యయోగిహృద్వాస దు ♦ ర్భవవినాశ
లక్ష్మీవర......... 21

సీ॥ వైకుంఠవాసనీ ♦ వర్ణనల్ వినునాదు
చెవులకు దుష్కథల్ ♦ తవులనీక
నారాయణానీదు ♦ నామామృతముగ్రోలు
జిహ్వకుపరకథల్ ♦ చేరనీయక
కమలాక్షునీపాద ♦ కమలముల్ గనునాదు
కనులకుపరకాంత ♦ గనగనీక
గోవిందనీనామ ♦ గుణముల చింతించు
చిత్తమందజ్ఞాన ♦ చింతనిడక
తే॥ గీ॥ నరకకూపంబులోనన్ను ♦ నురుకనీక
పరమపదమిమ్ము త్రైలోక్య ♦ పారిజాత
లక్ష్మీవర......... 1

సీ॥ నారాయణానీదు ♦ నామామృతంబెప్డు
నాలుకయందీవె ♦ నాటరాద
దేవజగన్నాథ ♦ దివ్యమౌ నీకీర్తి
చెవులతోవినునట్లు ♦ చేయరాద
జగదంతరాత్మనీ ♦ సత్యస్వరూపంబు
నేత్రంబులందెప్డు ♦ నిలుపరాద
వసుదేవతనయనీ ♦ వరపాదయుగళినా
చిత్తపీఠమునందు ♦ జేర్పరాద
తే॥ గీ॥ పరమపదమబ్బునట్టి నీ ♦ పాదభక్తి
రూఢిపడునట్లునన్నుగా ♦ పాడరాద
లక్ష్మీవర......... 1

సీ॥ శ్రీరమాచిత్తేశ ♦ జీమూతసంకాశ
కాలత్రయాతీత ♦ కంజనేత్ర
జగదీశ వేదార్థ ♦ సన్నుతగుణజాల
భువనసంరక్షణ ♦ పూర్ణతేజ
సాధుహృద్వాసశ్రీ ♦ రాధామనోల్లాస
లోకసంతతశుభ ♦ శ్రీకరాత్మ
సింధు గంభీరాత్మ ♦ సేవకమందార
వైకుంఠనిలయ శ్రీ ♦ వాసుదేవ
తే॥ గీ॥ ఇన్ని నామంబులనుచు ని ♦ న్నెంచగలరె
సర్వనామంబులును రూప ♦ సరణులీవె
లక్కవర......... 20

సీ॥ రాధేశగోవింద ♦ రాఠశ్రీగోపాల
దుష్కరభవభంగ ♦ దురితదూర
పరమపురుష కృష్ణ ♦ పద్మనాభాచ్యుత
శ్రీరమాధీశను ♦ శ్రీవిలాస
కాళీయమర్ధన ♦ కంసపంహారక
దివ్యసుందరరూప ♦ దేవదేవ
కరివరదాశౌరి ♦ స్మరకోటిమోహన
దివ్యసుందరరూప ♦ దేవదేవ
తే॥ గీ॥ బాలగోపాలసురజాల ♦ భక్తపాల
భవ్యయోగిహృద్వాస దు ♦ ర్భవవినాశ
లక్కవర......... 21

సీ॥ లలితకనకచేల ♦ లావణ్యపరిపూర్ణ
జయగోపికానాథ ♦ సదమలాంగ
హరిపరమాత్మద ♦ యాంభోధి కేశవ
సారసభవనుత ♦ చరణకమల
సనకాదిమునివంద్య ♦ సజ్జనపరిపాల
దేవకీనందన ♦ దేవదేవ
శంకర ముఖనుత ♦ సర్వజ్ఞసర్వేశ
రాజీవనేత్ర సిరిదను దేవ
తే॥ గీ॥ శ్రీరమాధీశ శ్రీకృష్ణ ♦ చిన్మయాత్మ
గోపికాలోల యతిముని ♦ కోటిపాల
లక్ష్మీవర......... 2[illegible]

సీ॥ భవవినాశాచ్యుత ♦ పరమ పదనివాస
పద్మనేత్ర దేవ ♦ పరమపురుష
దీనశరణ్యయో ♦ దేవదేవేశ్వరా
కరిరాజవరదభక్త ♦ కల్పభూజ
నందగోపక బాల ♦ నాథహరేకృష్ణ
కళ్యాణగుణబృంద ♦ కంబుకంఠ
కౌస్తుభవక్షుసం ♦ క్రందనసుతపక్ష
రాధామనోహర ♦ సాధువంద్య
తే॥ గీ॥ లోకగురుడవు పరమాత్మ ♦ లోకనాథ
రమ్యగుణధామ యదుకుల ♦ రాజచంద్ర
లక్ష్మీవర......... 2[illegible]

సీ॥ సత్యాపతీలోల । జాంబవతీనాథ
కాళిందిధవుడశ్రీ । కమలనేత్ర
శ్రీలక్షణాసతీ । చిత్తాబ్జసంచార
మిత్రవిందాపతీ । మేదినీశ
భద్రాసతీముఖ । పద్మషట్పదరాజ
రాధికానాథశ్రీ । నాథశౌరి
అఖిలభక్తాధార । యోగమసంచార
ద్వారకావాసశ్రీ । వాసకృష్ణ
తే॥ గీ॥ పదియునార్వేలు స్త్రీలునీ । ప్రక్కనున్న
నస్ఖలిత బ్రహ్మచారివీ । వంద్రుబుధులు
లక్కవర...... 24

సీ॥ అజహారముఖరులౌ । నిజభక్తులకునీదు
మాటయేతారక । మంత్రమరయ
ప్రహ్లాదనారద । పరమభక్తులకునీ
పలుకులు తిరుమంత్ర । భావవిధులు
శబరియహల్యాది । పత్నిలవతులకు
నీనామమేమహా నియమజపము
కరిరాజహనుమంత । ఘనవిభీషణులకు
రక్షగానీదునా । నామాక్షరములు
తే॥ గీ॥ పరమపావనమంగళ । ప్రదముగాదె
రామకృష్ణాదినీదివ్య । నామములును
లక్కవర...... 26

సీ॥ గ్రాహంబుచేజిక్కి ♦ కష్టంబుతో వేద
కరిరాజునవలీల ♦ గాచినావు
శరణన్న యావిభీ ♦ షణునకు నప్పుడే
మెచ్చిలంకారాజ్య ♦ మిచ్చినావు
తండ్రిదండనలకు ♦ నండనీవనివేడు
ప్రహ్లాదు బాధల ♦ బాపినావు
శబరితెచ్చినపండ్లు ♦ చవిచూచిభక్షించి
యుత్తమపదవినీ ♦ వొసగినావు
తే॥ గీ॥ అటులనేనన్నురక్షించు ♦ మాదరించి
జన్మరాహిత్యపదవిమ్ము శాశ్వతముగ
లక్కవర...... 26

సీ॥ మూడవనెలయందు ♦ ముద్దులబాలుడై
దానవీసంహార ♦ దైత్యుడెవడొ
ఏడవనెలయందు ♦ నెగసితృణావర్తు
మెడపట్టుకునిచంపు ♦ మేటియెవడొ
ఏడాదికుఱ్ఱడై ♦ యెగసి యాశకటుని
పాదంబుతోగూల్చు ♦ బలియుడెవడొ
బాలుడై సాహసో ♦ ద్భాసియైతనమేన
మామగు కంసుని ♦ మాపెనెవడొ
తే॥ గీ॥ దుష్టనరకాదిదైత్యుల ♦ దునిమెనెవడొ
అట్టిశ్రీకృష్ణుడవునీవె ♦ యమరవంద్య
లక్కవర...... 2

సీ॥ కృష్ణాయనిపలుక । కృపకునుగష్టముపోవు
భవబంధదుఃఖముల్ । బాసిపోవు
దేవకీసత్పుత్రి । దేవదేవాయన్న
సంసారసాగర । హింసతొలగు
మోహనాకార శ్రీ । ముద్దుకృష్ణాయన్న
కామలోభాదుల । గర్వమడగు
మాధవా యనియన్న । బాధలునశియించి
యీషణత్రయమును । దోషమొందలు
తే॥ గీ॥ జన్మమరణాదిదుః ఖముల్ । పమసిపోవు
కృష్ణనీమహానామ సం । కీర్తనముల.
లక్ష్మీవర........ 28

సీ॥ సంసారమనఃతమ ।స్సంఘుంబులడగునే
భక్తిసారజ్యోతి । ప్రభలులేక
తాపత్రయాభీల । దావాగ్నులారునే
భక్తిసారసువృష్టి ।సక్తిలేక
నిష్కళసుజ్ఞాన । మోక్షంబుగల్గునే
భక్తిసారాంజన । రక్తిలేక
సకలకుటిలదుఃఖ । జలరాసులింకునే
భక్తిసారనుబడ । బాగ్నిలేక
తే॥ గీ॥ భళిరకృష్ణనామామృత । పరమమంత్రి
సారవన్ జీవనౌషధ । సారమిదియె
లక్ష్మీవర...... 29

సీ॥ పాంచాలికిని వస్త్ర ♦ బహుళంబుగల్పించె
భవదీయకరుణసె ♦ భాసనంగ
యలకుచేలవిదురు ♦ ల భాగ్యరులకుగల్గె
కృష్ణనీకరుణను ♦ తృష్టపదవి
ముచుకుందమైత్రేయ ♦ ముఖులందరిముక్తి
రాధేశమంత్రిసు ♦ బోధవలన
గోపికాస్త్రీలును ♦ గోపకులాదిగా
చోద్యంబుగాముక్తి ♦ మారగొనిరి

తే॥ గీ॥ పరమపావన మంగళ ♦ ప్రదముగాన
ఏమిచెప్పుదు శ్రీకృష్ణ ♦ నామమహిమ
లక్ష్మావర.......

సీ॥ కావుకావుమటంచు ♦ గాకాసురుడురాగ
కాచిరక్షించిన ♦ నుడవీవ
శిలయైనగౌతము ♦ చెల్వనుపదరజం
బున కాంతజేసిన ♦ ఘనుడవీవ
అట్టిమూతాటకి ♦ గొట్టివేగమగాధి
పట్టియాగముగాచు ♦ దిట్టవీవ
దంతి వత్సలభక్త ♦ చింతామణివి విశ్వ
మునుగాచుచున్నట్టి ♦ ఘనుడవీవ

తే॥ గీ॥ భక్తసంరక్షణబిరుదు ♦ పరగనీవి
గానసీభక్తియేగతి ♦ గానలోల
లక్ష్మావర.......

సీ॥ సంసారసాగర ♦ హింసనుతొలగింప
గోపాలమంత్రింబు ♦ గుర్తుగాదె
మోక్షంబుజేర్పించు ♦ దీక్షకుతగుబాట
కృష్ణనామధ్యాన ♦ తృష్ణగాదె
యీషణత్రియమను ♦ యేరులుదాటింప
గోవిందకీర్తన ♦ నావగాదె
కామమోహాదుల ♦ ఖండించుటకుగాను
కమలాక్షభజనయన్ ♦ గత్తిగాదె

తే॥ గీ॥ యేమిచెప్పుదు శ్రీకృష్ణ ♦ నామమహిమ
నలవిగాదయ్య వర్ణించ ♦ వజునికైన
లక్కవర....... 32

సీ॥ బాల్యంబునందున ♦ భామామణులగూడి
తిరుగుటెగాని నీ ♦ స్మరణలేదు
తరుణంబుననుచాల ♦ దారానుతాదుల
పోషణగాని నీ ♦ పూజలేదు
వృద్ధాప్యమందున ♦ పెద్దసంసారంపు
చింతలోనుంటిమీ ♦ చింతలేదు
చావుసిద్ధంబైన ♦ శమనకింకరులట్లు
పాశంబుననుజుట్టి ♦ ప్రాణములను

తే॥ గీ॥ లాగగొంపోవయపుడేమి ♦ లాభమింక
నేనిపుడెసేతుగోవింద ♦ నీదుభజన
లక్కవర...... 33

సీ॥ శ్యామలవర్ణ స । శ్యామలాంగశౌరి
శంఖచక్రద్వయ । శస్త్రహస్త
నందయశోదాత్మ । నందనగోపాల
వాసుదేవాత్మజా । వత్సదమన
వత్సబకాదిక । వైరిసంహారకా
గార్ధభదైత్యయ । కాలకృష్ణ
కబళితదవశిఖి । కంజజసన్నుత
కంససంహారకా । కంజనేత్ర

తే। గీ॥ దేవతాచక్రవర్తివి । దేవదేవ
అలవియేనిన్నువర్ణింప । నలువకైన
లక్ష్మీవర........ 8

సీ। రాసకేళీలోల । రాధాహృదాంభోజ
వసుచోరగోపికా । వర్గమార
నవనీతహారయో । నవమన్మథాకార
వంచితవిద్విష । ద్వారసమూహా
శ్రితపారిజాతకు । శేశయహితవిధు
లోచనయుగళత్రై । లోకపూజ్య
కాళీయఫణిఫణ । ఘట్టనగోపికా
గీతాప్రమోదసం । గీతలోల

తే। గీ। వ్యోమకేశాదిసన్నుత । శ్యామలాంగ
సకలదాసావనాశౌరి । జగదధీశ
లక్ష్మీవర......

సీ॥ కాళీయఫణమహా ♦ కేళీవిలోలనా
రదగానలోల నీ ♦ రదవినీల
పూతనసంహార ♦ భువనత్రియప్రభో
మురవరకాంతకా ♦ ముద్దుబాల
ధేనుకముఖమష్ట ♦ దానవాంతకశౌరి
శిశుపాలసంహార ♦ చిన్నికృష్ణ
క్రతుపరిపాలకా ♦ కాలయువనయమ
మాగధమదహర ♦ మానివినుత
తే॥ గీ॥ పాలితామరజాల కు ♦ బ్జావిలోల
గోపికాసటతస్కర ♦ గోపబాల
లక్కవర...... 87

సీ॥ శకటాసురహరణ ♦ సర్వజగన్మయ
శంఖచక్రపరిభా ♦ శస్త్రహస్త
జగదంతరాత్మక ♦ సారపదశనేత్ర
ఉద్ధవగురువరా ♦ ఉత్తమాఖ్య
ప్రహ్లాదముఖభక్త ♦ పరిపాలకరిపాల
భుక్తదవానల ♦ పూర్ణతేజ
అర్జునసారధి ♦ యానందదాయక
శ్రీకృతశుభగుణ ♦ శ్రీకరాత్మ
తే॥ గీ॥ దేవకీగర్భసంజాత ♦ దేవదేవ
తలతునుతియింతుధ్యానించు ♦ తగభజింతు
లక్కవర....... 88

సీ॥ ఘల్లుఘల్లనికాళ్ల । గజ్జెలందెలుమ్రోయ
మొలనూలిఘంటలి । మ్రొగనటింప
రాకేందువదనంబు । రక్తిగాదరహాస
శోభతోజగముల శుభముదెల్ప
భాసురానాశికా । భరణమౌముత్యంబు
బింబాధరముపైన । పెంపుగుల్క
దిద్దినకస్తూరి । తిలకంబుతోగూడి
నిటలతటద్యుతుల్ । నివ్వటిలగ
తే॥ గీ॥ నరయనవమన్మధాకార । మైననీదు
భవ్యదర్శనమిాగదే । భక్తునకును
లక్కవర......

సీ॥ వ్రేపల్లెలోగల । గోపభామలయిండ్ల
వెన్నదొంగిలినావె । వేడుకలర
ఘనముగనుయశోద । గట్టెముకాగోల
రజ్జువందదునీదు । బొజ్జచుట్ట
అండపిండాండ బ్ర । హ్మాండమంతయుగాంచె
నీముఖంబునతల్లి । నిర్మలముగ
వాసవుఘనశిలా । వర్షమాపవెగోట
గోవర్ధనాద్రినీ । గొడుగుజేసి
తే॥ గీ॥ గోవులనుగాయుచుండగ । గోపకులతో
తెలియలేదయ్యెనీమాయ । నలువయూర
లక్కవర......

సీ॥ పద్మనిచ్చినమామ ♦ పాదోధికెనిబహు
మానమహాధామబా ♦ నానలంబు
విందారగింపంగ ♦ వేడ్కబిల్చినమామ
గడతేర్చుటాపాద ♦ కట్టుమరయ
సర్వవ్యాపిమాయమామా ♦ సురపతినొప్పించి
పారిజాతముగొంట ♦ పసదనంబె
మామామయున్నమగోష ♦ మానినుల్కొరపెట్ట
మానభంగముచేయు ♦ మంచిపనిక

తే॥ గీ॥ సర్వలోకాధిపతివిసీ ♦ చర్యలిట్లు
వినియెకాక్షలు మామల ♦ గినిసియల్లు
రెల్లబాధింతురిదియునీ ♦ వల్లగలిగె
లక్కవర......

సీ॥ వెన్నదొంగిలిమెక్కి ♦ వేదాంతగూఢార్థ
ములబల్కనరుదేర్ప ♦ గలిగినావ
నేలకన్నులగీటు ♦ విజ్ఞానవాక్యాళి
మించియుద్ధవునుద్ధ - రించినావు
ఆలమేపుచునాట ♦ లాడుచునవలీల
దావాగ్నిసుధవోలె ♦ ద్రావినావు
మన్నుమెక్కుచునోట ♦ కన్నతల్లికజాండ
కోట్లజూపవెదిన్న ♦ కుబ్జనవయి

తే॥ గీ॥ భక్తహృదయాబ్జ సంవాస ♦ ధర్మవాస
ఆస్యసౌందర్యజితచంద్ర ♦ యాదవేంద్ర
పాలితామరజాలగో ♦ పాలబాల
లక్కవర......

సీ॥ పాంచాలికషిగిన ♦ పాకబాండములోని
బలుపాకుధరబల్కు ♦ బ్రహ్మవశమె
కుంటుచేతుంనొత్తు ♦ కుబ్జగంధపుప్రాత
విలువనెంతయొజెప్ప ♦ గలడెహరి
ప్రీతివిదురుడిచ్చు ♦ పేదసాదము వెల
నలవియేబల్కు శే ♦ షాహికైన
చిగురుచెంగునను కు ♦ చేలుండుగట్టిన
పృథుకములెవ్వలదెల్పు ♦ పెద్దగలడె

తే॥ గీ॥ భళిరభక్తులపాలిటి ♦ పారిజాత
మనెడు బిరుదంబురూఢి నీ ♦ కగునుగాని
యితరదైవంబులనువారి ♦ కెట్లుతగును
లక్ష్మీవర......

సీ॥ చేపిడిగుద్దితో ♦ శితికంఠుగెల్చిన
నరుడుబృహన్నల ♦ మఱచితనుచు
సురపతిముఖరమ్యా ♦ చూర్పులమా నరకుని
దెగటార్చు యబలనీ ♦ దేవియనుచు
పూముల్కువేసి య ♦ ప్పురహరునొంచిన
యట్టియనంగుడు ♦ పట్టియనుచు
గజపురిహాలమున ♦ గంగముంపగజాలు
నాతండుబలుడు నీ ♦ యన్నయను

తే॥ గీ॥ గర్వహారిప్రియమనుచు నీ ♦ కాళ్ళబడిన
మమ్ము విడనాడుటది శాస్త్రి ♦ సమ్మతంబె
సర్వశాస్త్రార్థవేత్తవి ♦ చర్యలేల
లక్ష్మీవర......

సీ॥ శ్రీరుక్మిణీప్రాణ ♦ కేశయమదభంగ
ఖలదైత్యసందోహ ♦ గర్వభంగ
కుబ్జామనోల్లాస ♦ గోపికాపరిహాస
యుక్తవాక్యాభ్యాస ♦ యోగ్యహాస
బాల్యమిత్రకుచేల ♦ భాగ్యసంధాయక
పాకశాసనపుత్ర ♦ పరమమిత్ర
ఫల్గుణామకోన్మోహ ♦ భావవిచ్ఛేదక
పరమవేదాంతివా ♦ క్యార్థవమతి

తే॥ గీ॥ రాజసూయమహాధ్వరా ♦ రాధ్యపాగ
గోపికావర్గహల్లోల ♦ గోపబాల
లక్ష్మీవర...... 45

సీ॥ ఇాదిరాకరలిప్త ♦ చందనంబునుమించి
సత్యకిల్లడవేర్పాటు ♦ చల్లదనము
ధరభక్తినొసగు క ♦ ప్పూరపువిడెంబున
కగ్గమాగోపిక ♦ బుగ్గపోటు
నీలారచితసుమ ♦ మాలనుతలదన్ని
కదుహాయియొకబ్జ ♦ కౌగిలింత
మహతీస్వనాత్యంత ♦ మాధుర్యమునుమించె
గోపాలకులవెత్తి ♦ గొల్లముద్దు

తే॥ గీ॥ లెంతొవింతలు నీచర్య ♦ లెన్నవశమె
వేదవేదాంతవేద్యుండ ♦ వాదిదైవ
మరమనీవేగదాకృష్ణ ♦ పరసిజాక్ష
లక్ష్మీవర...... 46

సీ॥ వెర్రిగొల్లలగుంపు ॥ విభుదేంద్రుబ్రహ్మాదియమరా
సురవర్గమాశావళీ ♦ చోద్యవికార
ఆలమందలలోన ♦ యంభారవములు
సామగానాద్భుత ♦ స్వనమువింత
పాలమ్మకొనుగొల్ల ॥ పడుచులెల్లనుసీకు
పట్టంపుదేవులా ॥ పద్మవలెను
కడిమిపూగుత్తులు ♦ కౌస్తుభమాణిక్య
సంపదాయెంతోవా ॥ స్యాప్పదంబు
తే॥ గీ॥ తలపమెడనున్న లేగల ♦ పలుపులెల్ల
వెండిపైడియునింపిన ♦ నిండుకొట్లు
ఘోషవైకుంఠనగరమా ♦ శేషశాయి
లక్ష్మీవర...

సీ॥ గోపీకుచస్థలీ ♦ కుంకుమాంకితవక్ష
సంతతభక్తౌఘ ॥ సాధురక్ష
కంసాదిఖలదైత్య ♦ గజఘటాహార్యక్ష
కదనవిఖండిత ♦ మదవిపక్ష
సంఫుల్లనీరజ ॥ సౌభాగ్యదకటాక్ష
నతవర్గసంరక్ష ♦ నాతిదీక్ష
తే॥ గీ॥ కామితార్థగవిఖ్యాత ♦ కల్పవృక్ష
ఆశ్రయించితిచేరి ॥ చేయకుముపేక్ష
నీపాదిక్కు సుమీరాధి♦ నీరజాక్ష
లక్ష్మీవర......

సీ॥ అన్యాంగనలజూచు॥ టఘహేతువందున
జలకమాడెడిపట్ల॥ చాలతప్పు
మఱియునువస్త్రాప॥ హరణంబునింద్యమై
పాపకారణమంచు॥ బుల్కువిధులు
నగ్నజూచుటమహా॥ నర్ధదాయకమంచు
శాస్త్రముల్ వేనోళ్ల॥ జాటవినమె
సాందీపునొద్దను॥ చదివినశాస్త్రంబు
లిందుకాభళిరగో॥ వింద కృష్ణ
తే॥ గీ॥ తోయములపైడి పైకిచే॥ తులనుమోడ్చి
వచ్చిపటములుగొమ్మంచు॥ బలికితౌర
దేవనీవింతలవిరించి॥ తెలియగలడె
లక్ష్మీవర ...... 48

సీ॥ యదుకులభూషణా॥ యాదవతోషణా
బలరామసోదరా॥ పాహిపాహి
మురళీసుగాయకా॥ ముదికుబ్జరక్షకా
పాండవభయహర॥ పాహిపాహి
గోకులవర్ధనా॥ గోపికాలోలాత్మ
భక్తౌఘసన్నుతా॥ పాహిపాహి
తులసీవిభూషణా॥ కలిభయదూషణా
పాపవినాశన॥ పాహిపాహి
తే॥ గీ॥ భక్తమందారనీదివ్య॥ పాదపూజ
సల్పుచుండెదనోకృపా॥ నల్పబోవు

సీ॥ పార్థసారథివై చు♦ పార్థునకునుకృప
గీతార్థబోధవి♦ ఖ్యాతిగాను
దనరనష్టాదశా♦ ధ్యాయంబులనుబల్కి
యుపనిషత్సారంబు♦ నోజదెల్పి
దివ్యనేత్రములిచ్చి♦ దేదీప్యమానమౌ
విశ్వరూపముజూపి♦ వేడ్కనల్లు
పార్థుసందేహంబు♦ బారదోలియురణ
సంగంభిజేయవే♦ శర్వవినుత
తే॥ గీ॥ బదరికాశ్రమమందు ద♦ పంబుసల్పు
నరుడు నారాయణుడువీరె♦ పరమపురుష
లక్కవర। .......

సీ॥ ఎక్కడిసతినుతు♦ లెక్కడిచుట్టంబు
లెక్కడిహితులును♦ మక్కువలర
నెక్కడిసోదరు♦ లెక్కడితలిదండ్రు
లెక్కడిపౌత్రులి♦ యిలకుగాంచ
నెక్కడిపశుభృత్యు♦ లెక్కడిరాజ్యంబు
లెక్కడిసౌఖ్యంబు♦లక్కజముగ
నెక్కడిసంసార♦ మిదియంతయునుమాయ
స్వప్నతుల్యముగదా♦ సరసిజాక్ష
తే॥ గీ॥ యిట్టిభోగంబులందాశ♦ నీసడించి
నిన్ను వేడుటెఱుఁగనతర♦ నిత్యపదవి
లక్కవర॥ .......

సీ॥ పగలన్ని మయుముల॰ బలికెదునాదగు
కలుకులేనీనామ॰ పరమజపము
హస్తయుగ్మముతోడ॰ ననుదినంబును జేయు
పలురీతిపనులెల్ల॰ పాదసేవ
నవనిపై నిడెడునా॰ యడుగులుపరికించ
దమకునుజేయుప్ర॰ దక్షిణములు
పాన్పుపై నిశలట్లు॰ పవళించుటలునీకు
వసుధపై సాష్టాంగ॰ వందనంబు
తే॥ గీ॥ గాదలంచుము సతతంబు॰ కమలనాభ
నాదుకోర్కెలనీడేర్పు॰ నళిననేత్ర
లక్కవర। ....... 52

సీ॥ పరమభాగవతులు॰ ప్రహ్లాదనారద
బకగార్గ్యభీష్ములు॰ శుకమహర్షి
వ్యాసాంబరీషులు॰ వాల్మీకియతియు
గౌతమమాండవ్య॰ కణ్వముఖులు
అర్జునవాశిష్ఠు॰ లక్రూరకౌశికుల్
బలివిభీషణులును॰ భార్గవుండు
శౌనకుండంజనీ॰ సూనుండుబృహదశ్వ
ముఖరులౌసద్భక్త॰ మూర్తులెల్ల
తే॥ గీ॥ మిగులవర్ణించలేరన్న॰ మీగుణముల
నేనువర్ణించనేర్తునా॰ నీరజాక్ష
లక్కవర। ...... 5

సీ॥ సత్యభామాచిత్త ♦ సరసిజమదభృంగ
నీలనీరదనిభ ♦ నిర్మలాంగ
ఖలవైరిసందోహ ♦ కంజాతమాతంగ
అశ్రాంతకరుణాయు ♦ తాంతరంగ
నారదసనకస ♦ నందనాద్యనుషంగ
సంతతనిగమాంత ♦ సత్ప్రసంగ
సకలలోకశ్రేయ ♦ సంధాయకాపాంగ
సర్వవిపక్షుదు ♦ర్గర్వభంగ
తే॥ గీ॥ ఖండితాసురసముదాయ ♦ కదనరంగ
నిందుకృపజూడుమానన్ను ♦ పాండురంగ
దాసుడను గొల్తు గావంగ ♦ దయచెలంగ
లక్కవర.........

సీ॥ శారదచంద్రికా ♦ సమరుచిహైయంగ
వీణాంబునొకచేత ♦ వేడ్కనమర
అమృతోపమానమై ♦ యలరారుపాయస
భక్తంబునొకచేత ♦ పరిఢవిల్ల
పుండరీకసఖంబు ♦ నిందుచందురుగేరు
కాంతులుమెడకిృంద ♦ గంతులిడగ
కనకసూత్రస్ఫీత ♦ ఘంటావితానంబు
దిసమొలమ్రోగుచు ♦ తేజరిల్ల
తే॥ గీ॥ తల్లివెనువెంటముద్దుగా ♦ తప్పటడుగు
లలరదికిగెడుదివ్యాది ♦ గంబరుండు
పద్మపత్రాక్షునీవె శ్రీ ♦ పతిముకుంద

సీ॥ ధనముకుమించిన॥ ధాటియౌరత్నంబు
రమ్యమౌమురళియు॥ రత్నమిదియు
వెలలేనివేడుక॥ వేదాంతరత్నంబు
శ్రీకృష్ణరత్నంబు॥ శ్రేష్ఠమిదియు
చోరులకందని॥ సుందరరత్నంబు
లక్ష్మీకరంబగు॥ రత్నమిదియు
దారిద్ర్యదోషంబు। నార్పురత్నంబు
శ్రీకృష్ణరత్నంబు॥ సిద్ధమిదియు
తే॥ గీ॥ లక్ష్మికిని యిక్క శాశ్వత॥ రత్నమిదియె
రమ్యమౌకృష్ణమంత్రము॥ రత్నమిదియె
లక్ష్మవర॥ ...... 56

సీ॥ శ్రీకృష్ణుబూజించు॥ చేతులు చేతులు
శ్రీవిష్ణుబొగడెడి॥ జిహ్వజిహ్వ
గోపాలహరిగాంచు॥ చూపులేచూపులు
యదునందనుని మ్రొక్కు॥ నుదురునుదురు
కమలాక్షుకథవిను॥ కర్ణంబెకర్ణంబు
మాధవునందుండు॥ మనసుమనసు
శౌరివద్దకునేగు॥ చరణముల్ చరణముల్
పురుషోత్తమునిగూడి॥ బుద్ధిబుద్ధి
తే॥ గీ॥ దీనరక్షకుతలచెడి॥ దినమెదినము
వేదవేద్యునివర్ణించు॥ విద్యవిద్య
లక్ష్మవర॥ ...... 57

సీ॥ నీలమేఘమునందు ♦ నిలచిన క్రొక్కారు
మెరుపురీతిని సిరి ♦ యురమునందు
కుడిభాగమునసీళ ♦ యెడమభాగంబున
భూదేవి ఒప్పురత్న ♦ భూషణములు
బంగరంచులకు సుం ♦ దావస్త్రములుదాల్చి
వెలయంగకస్తూరి ♦ తిలకమలర
లీలగా మెరయుచు ♦ నళి సమూహమురీతి
కుటిలాలకంబులు ♦ నిటలమునను

తే॥ ॥ తనులకాటుక గంధలే ♦ పనము లమర
వరకిరీటంబుగల నిన్ను ♦ నరయకోర్కె
లక్కవర..........

సీ॥ మకుటకౌస్తుభరత్న ♦ మకరకుండలములు
ఘనమేఖ లాంగద ♦ కంకణములు
వరనవమాలికా ♦ వైజయంతులతోడ
నమరుగ్రైవేయక ♦ హారములును
కనకాంబరమునీల ♦ కాంతులనీను దే
హమునందు వెలుగగా ♦ నభయద
కలితదక్షిణకర ♦ కమలంబుపావన
చరణంబులర్పింప ♦ దెసవుచూప

తే॥ గీ॥ వామహస్తాంబుజము కటి ♦ సీమనొప్ప
భక్తకల్ప కవిఖ్యాతి ♦ బరగుదీవు
లక్కవర..........

సీ॥ పాదపద్మంబులు ♦ పాతాళలోకంబు
వరశిరోభాగము ♦ పరమపదము
మధ్యలోకంబులు ♦ మధ్యభాగంబౌను
నేత్రంబులుపద్మ ♦ మిత్రశశులు
శ్రోత్రముల్ దిక్కులు ♦ సుము ఖతనాశికా
గ్రంబును సత్యయు ♦ గ్మ్రంబుగాగ
జిహ్వానీరవర్షిభుల్ ♦ సిద్ధమహాకుక్షియం
బోధి బృందంబు సం ♦ పూర్ణమలర
తే॥ గీ॥ నాడులెల్ల బ్రవాహము ♦ నంగరోమ
ములును వృక్షజాలంబులౌ ♦ పొసగనీకు
లక్ష్మీవర....... 61

సీ॥ శల్యముల్ గాంచనీ ♦ సర్వశైలంబులు
కేశపాశంబులు ♦ శ్రీశనీకు
మేఘజాలంబులు ♦ మిగులప్రాణము గంధ
వాహుండు బాహువుల్ ♦ వాశిగాను
నిండాద్రిదుర్లైయొప్ప నింపుగ ♦ గుహ్యేంద్రి
యంబు ప్రజానాధు ♦ డరయనీకు
సృష్టిసద్వీర్యమై ♦ వెలయుసుస్తనం
బెన్నగ ధర్మంబు ♦ సన్నుతాంగ
తే॥ గీ॥ సారవాగింద్రియంబెన్న ♦ సమతవహ్ని
దంష్ట్రిలునుదండహస్తుండె ♦ తలచనీకు
లక్ష్మీవర....... 62

సీ॥ శ్రీకృష్ణునకుసేవ ♦ చేయనిదేహంబు
గాలిలోనిట్టబట్టు ♦ కదలుశవము
నిందిరాపతిగాంచ ♦ నెరుగని చక్షువుల్
కేకిపించాక్షులు ♦ లోకమందు
హరిపూజనములేని ♦ హస్తంబులనుగాంచ
నావతెడ్లెగదా ♦ నాణ్యమలర
శౌరికథలువిన ♦ నేరనికర్ణముల్
పర్వతబిలములు ♦ పరగగాంచ

తే॥ గీ॥ వరదునామంబు పొగడని ♦ వక్త్రికులర
డోలువాయిద్యసమముగో ♦ పాలకృష్ణ
లక్కవర। ...... 62

సీ॥ సద్గురునాజ్ఞను ♦ శ్రీవణసంకీర్తనల్
వందనార్చనములా ♦ నందమలర
సఖ్యంబుసేవయు ♦ సదమలాత్మార్చన
దాస్యముల్ చింతస ♦ ద్ధర్మముగను
నవవిధభక్తితో ♦ నారాయణునియందె
చిత్తంబునిల్పియు ♦ సేవజేతు
నిటువంటిసద్భక్తి ♦ యెప్పుడునాయందు
నిలచియుండెడిబుద్ధి ♦ నెలమినిమ్మ

తే॥ గీ॥ భక్తసంరక్షణానంద ♦ పావనాత్మ
మానిచిత్తాబ్జభృంగ శ్రీ ♦ గానలోల
లక్కవర। ....... 63

సీ॥ జీవముండగనిన్నె ♦ చిత్తంబులోచేర్చి
స్తోత్రింబు సల్పెద ♦ సుస్థిరముగ
కఫవాతపైత్యముల్ ♦ కప్పియుండగనిన్ను
ధ్యానించలేనేమొ ♦ తలపలేనొ
దీపముండగనింట ♦ నోపికపనులెల్ల
జక్కపెట్టుకొనిన ♦ చందముగను
భద్రింబుతోరామ ♦ భద్రాయటంచును
యిప్పుడేతలపోతు ♦ నిందిరేశ
తే॥ గీ॥ చిత్తమందున మరువక ♦ శేషశయున
నిన్నుస్మరియించు తలపోతు ♦ నిశ్చలముగ
లక్కవర॥ ....... 64

సీ॥ జన్మమేచింతయు ♦ జరయును చింతయూ
భార్యయుచింతయై ♦ బరగుచుండు
అన్నిటసంసార ♦ మధికమూ చింతయూ
నాశయుచింతయూ ♦ వాసిగాను
కర్మంబు చింతయూ ♦ గడువడిసుతులును
చింతయూనీపూజ ♦ చేయకున్న
నరలోకమేచింత ♦ నరకంబుచింతయూ
శ్రీహరినీచింత ♦ చేయకున్న
తే॥ గీ॥ నిన్నుచింతించదొలగును ♦ అన్నివెతలు
గాన కరుణించు నీచింత ♦ గల్గునట్లు
లక్కవర॥...... 65

సీ॥ నామదియందున ♦ కామలోభాదులు
నివసించియున్నారు ♦ నిర్భయముగ
వారాగ్గురునుమహా ♦ వైరులై జానమన్
రత్నంబుకాజేయు ♦ యత్నమునను
బాధించుచుంటనీ ♦ భక్తియన్ పలికిన్ని
కోటనీపాదముల్ ♦ గొల్తునెపుడు
అయుువంతయుక్షీణ ♦ మైపోవుచున్నది
కాచిరక్షించుమిదా ♦ కమలనాభ

తే॥ గీ॥ భక్తదీనార్త మందార ♦ భవవిదూర
పరమకరుణాంతరంగ శ్రీ ♦ పాండురంగ
లక్కవర........ 66

సీ॥ నీటియందున బుగ్గ ♦ నిత్యమెంతయుగాని
దేహంబుయిదియని ♦ తెలియలేదు
ఓటిమిత్రోడను ♦ నూరేండ్లు బ్రితికిన
వల్లకాటికిజేరు ♦ కల్లగాదు
అట్టహాసంబౌచు ♦ చుట్టాలుసుతులునీ
జీవమున్నవఱకె ♦ చేరుదురిల
యీావణత్రియమను ♦ యేరులుదాటించు
నాణ్యమానీమంత్రి ♦ నౌకగాదె

తే॥ గీ॥ కృష్ణనామంబు శరణము ♦ తృష్టముగను
పరమభక్తులకానంద ♦ పర్వమిదియె
లక్కవర॥ ...... 67

సీ॥ బ్రహ్మాదిమునులకు ♦ బాగైనమంత్రంబు
మహిచింతలణచెడి ♦ మంత్రమిదియ
దుఃఖ భవముబాప ♦ దొడ్డదీ మంత్రంబు
మహితామృతపరమ ♦ మంత్రమిదియ
సర్వైశ్వరైక్యసం ♦ సాధనమంత్రంబు
మహనీయవేదాంత ♦ మంత్రమిదియ
సంసారతారక ♦ జగదేకమంత్రంబు
మహితమోక్షముగూర్చు ♦ మంత్రమిదియ

తే॥ గీ॥ జన్మపావనమంత్రంబు ♦ జగతికెల్ల
మంత్రరాజంబునీనామ ♦ మహిమగాదె
లక్కవర॥....... 68

సీ॥ గోవింద కేశవ ♦ గోష్ఠరిపాలకా
శ్రీధరమురహారి ♦ శ్రీశవిష్ణొ
నారాయణాచ్యుత ♦ నందగోపాత్మజ
ప్రద్యుమ్ననరశింహ ♦ పద్మనాభ
వైకుంఠపరమాత్మ ♦ వాసుదేవాహరి
శార్ఙ్గిపీతాంబరా ♦ శ్యామలాంగ
పన్నగాద్రిశయన ♦ పక్షివాహనదేవ
పంకజలోచనా ♦ పరమపురుష

తే॥ గీ॥ లోకనాయకవరద త్రి ♦ లోకపూజ్య
లలితచారిత్రశ్రీకృష్ణ ♦ జలజనేత్ర
లక్కవర........ 69

సీ॥ వేయుశీర్షంబులు ♦ వేయునేత్రంబులు
వేయుఫాలంబులు ♦ వేదవేద్య
కోట్యర్కలేకమా ♦ మేటిసత్కాంతుల
విశ్వరూపుండవై ♦ వెలయుదీవు
పరిపూర్ణచిన్మయ ♦ పావనవిశ్వేశ
పరమార్థకేశవ ♦ ప్రణుతపక్ష
సర్వేశ్వరా భక్త ♦ సంరక్షణాకృష్ణ
కరిరాజపాలశ్రీ ♦ కంఠమిత్ర
తే॥ గీ॥ అంతయును నీవెగా, నీయ ♦ దంతమున్న
చిలువ రాజైన వర్ణింప ♦ నలవియగాని
లక్కవర॥ ....... 70

సీ॥ ఆదినారాయణా ♦ ఆపదోద్ధారకా
శ్వేతవాహనమిత్ర ♦ శ్రీకళత్ర
అలకుచేలునిచేతి ♦ యటుకులుభక్షించి
నెలమిని సంపద ♦ లిచ్చినావు
విజయునికినిమహా ♦ విశ్వరూపముజూపి
ముదికుందు నకు నీవె ♦ ముక్తిపదవి
హరికృష్ణయనినేడ ♦ నక్షయాంబరములు
మెచ్చియాపాంచాలి ♦ కిచ్చినావు
తే॥ గీ॥ యిట్టిసద్భక్తులనుగాచి ♦ నట్టు గతిని
నన్నుకరుణించునాతండ్రి ♦ నందతనయ 71

సీ॥ ధనము సంపాదించ । మనసునదుఃఖంబు
యాధనంబునకై య । హర్నిశంబు
కాచియుండుటెచాల । ఘనతరదుఃఖంబు
యావిత్తమునుచోరు । లపహరించ
గనుదుఃఖమాధన । మును వెచ్చమునుచేయు
నధికదుఃఖంబౌను । పృథివిలోను
బహుళదుఃఖములకు । ప్రాపగు విత్తంబు
విత్తవంతులకేది । చిత్తశాంతి
తే॥ గీ॥ పూటబత్తెమమాత్రమే । పొసగనిచ్చి
కరుణనాకిమ్ము నీపాద । కమలసేవ
లక్ష్మీవర....... 72

సీ॥ సత్యమీగదతల్లి । జగతికిపేక్షించ
తండ్రిసుజ్ఞానంబు । తథ్యమలర
సోదరుల్ధర్మంబు । సుస్థిరంబగుదయ
సఖుడును సమరస । శాంతబుద్ధి
ధర్మపత్నియనంగ । దనరునుమరియోర్పు
నుత్తమసుతుడందు । రుర్వియందు
వీరలార్వురెనాకు । కూరుచుబాంధవు
లని నీవె సెలవిచ్చు । నతులనీతి
తే॥ గీ॥ నామనంబున దిటవుగా । నాటునట్లు
కరుణరక్షించు విజ్ఞాన । కలితుజేసి
లక్ష్మీవర...... 73

సీ॥ ఆదినారాయణా ♦ యబ్జజభవముఖ
సన్నుతచరితయా ♦ జగతియందు
భూదేవి మొఱవిని ♦ భూ భారమడపంగ
ధర్మసంస్థాపనా ♦ ర్థంబుబుట్టు
దుష్టశిక్షణమును ♦ శిష్టరక్షణమును
సల్పినదశరూప ♦ ధారివయ్య
సర్వలోకాధార ♦ సర్వేశశ్రీకృష్ణ
భక్తావనోల్లాస ♦ భవవినాశ
తే॥ గీ॥ దండిబహిరంతరంబుల ♦ నిండియుండు
పరమ దైవంబవనినిను ♦ భజనజేతు
లక్కవర....... 74

సీ॥ ముచ్చుసోమకునేగ ♦ ముదమొప్పవధియించి
నాల్గువేదంబులు ♦ నలువకొసగు
మత్స్యావతారనీ ♦ మరుగుజొచ్చితినింక
నీమహామహిమలు ♦ నీకెయెఱక
బృందారకులువేడ ♦ మందరగిరినెత్తి
వాసిగాసుధగల్గ ♦ జేసినట్టు
కూర్మావతారనన్ ♦ గూర్మితోనేలుమా
నీదివ్యలీలలు ♦ నిర్మలముఖ
తే॥ గీ॥ వసుధచాపగచుట్టు నా ♦ యసురుద్రుంచి
కూర్మిజగములబ్రోచిన ♦ క్రోడరూప
లక్కవర....... 75

సీ. ప్రహ్లాదుడన్ భక్తు • బాధించునాహేమ
కశ్యపువధియింప • గాదలంచి
డింభకుడునువేడ • స్తంభమందునబుట్టి
నరసింహమూర్తివై • బరగితీవె
బలిచక్రవర్తిని • బంధించుపనికైనై
వామనవేషివై • వగలితీవె
ధరణిగలరాజ • వరులనుదండించ
పరశురామాఖ్యను • ప్రబలితీవె

తే॥ గీ॥ యనుచుజేసెదనీస్తవ • మంబుజాక్ష
అమరవందితగోపక్ష • ష్ణామురారి
లక్కవర....... 76

సీ॥ రాక్షసాంతకనీవె • రామావతారమై
యలవిభీషణుబ్రోచి • తభయదాన
కంకణబిరుదాంక • ఘనతరబలరామ
శ్రీకృష్ణరూపను • శ్రీకరాత్మ
కంసాదులనువేగ • ఖండించిదురమున
దుర్యోధనాదుల • ద్రుంపజేసి
రాజ్యంబుయాధర్మ • రాజునకిప్పించి
శ్రీజగన్నాథంబు • చేరియుంటి

తే॥ గీ॥ పరమబౌద్ధావతారమై • పరగితయ్యా
సర్వరూపంబులునీవె • సారసాక్ష
లక్కవర...... 77

సీ॥ సుజనౌఘపాలన ♦ కుజనౌఘసంహార
ణార్థంబుగాభూమి ♦ నవతరింతు
కలికిరూపుండవై ♦ కలియుగభక్తుల
కిష్టార్థసంపద ♦ లిత్తువీవె
శేషాచలంబందు ♦ శ్రీవేంకటేశాఖ్య
నలమేలుమంగ తా ♦ యారుపతివి
యిన్నిరూపంబుల ♦ యీశ్వరుండవునీవె
సర్వజీవాత్మక ♦ సాక్షిరూప
తే॥ గీ॥ శ్రీరమానిత్య సుఖదాయి ♦ శేషశాయి
భక్తరక్షణ ఘనకృష్ణ ♦ బాలకృష్ణ
లక్కవర....... 78

సీ॥ తల్లిదండ్రులుకల్ల ♦ తనయులు మరికల్ల
బంధువులునుకల్ల ♦ పరగగాంచ
హితులనగాకల్ల ♦ క్షితిసోదరులుకల్ల
పశుధనాదులుకల్ల ♦ పన్నుగాను
దేహేంద్రియాదులు ♦ నైహికాదులుకల్ల
అష్టభోగంబులు ♦ నరయకల్ల
యిల్లువాకిలికల్ల ♦ యిల్లాలుమరికల్ల
భ్రాంతికోర్కెలు కల్ల ♦ పరమపురుష
తే॥ గీ॥ అన్నికల్లలుగామది ♦ నెన్నినీదు
చరణసేవను సల్పుటే ♦ జన్మఫలము
లక్కవర....... 79

సీ॥ పల్లవాధరులైన ♦ గొల్లభామలగూని
యుల్లమునందు రం ♦ జిల్లువాడ
వెన్నదొంగవుతల్లి ♦ కన్నిలోకంబులు
నోటజూపినయట్టి ♦ నటవీవు
మల్లరంగమునందు ♦ మల్లులజెండాడి
మామయౌకంసుని ♦ మాపితీవు
కొల్లగనీమాయ ♦ వెల్లివిరియజేసి
సల్లాపమునక్రీడ ♦ సలుపుడట్లు
తే॥ గీ॥ కృష్ణమాధవగోవింద ♦ వృష్ణివంశ
దీపకానన్ను గావుము ♦ దేవదేవ
లక్ష్మ్వర...... 80

సీ॥ బ్రహ్మనిష్ఠులకును ♦ ప్రథమపుష్పమహింస
యనగ నింద్రియనిగ్ర ♦ హంబెపుష్ప
మునుసర్వభూత ద ♦ యను నిర్వహించుట
పుష్పంబుశాంతియే ♦ పుష్పమౌను
పొలుపొంద తపమొక ♦ పుష్పంబునిశ్చల
ధ్యానమేపుష్పమౌ ♦ తథ్యముగను
సత్యవిజ్ఞానముల్ ♦ చక్కనిసుమములు
నిర్గుణపూజకై ♦ నిర్ణయములు
తే॥ గీ॥ నష్టవిధ పుష్పములగూర్చి ♦ హారమొకటి
నిష్టనీకిచ్చి శ్రీకృష్ణ ♦ నిన్నుగొల్తు
లక్ష్మ్వర....... 81

సీ॥ మూఢచిత్తమనీకు । మోక్షసన్మార్గంబు
దెలిపెదసర్వంబు । తేటగాను
సతిసుతాదులురారు । చావుకాలంబందు
శ్రీహరిధ్యానంబె । శ్రేష్ఠకరము
గతజన్మములపుణ్య । కర్మంబుననగల్గు
ధనమది దానితో । గనుముతృప్తి
యిచ్చినమాత్రమే । యిచ్చునుదేవుండు
హెచ్చుగాకోరిన । నివ్వబాల
తే॥ గీ॥ దనుచుబోధింతు నామన । మట్టునెరిగి
సతమునీయందునిల్చి సం । గతియొసంగు
లక్కవర....... 82

సీ॥ స్త్రీలగుబ్బలయందు । చిత్తంబునిల్పియు
బంగరుగిండ్లని । రంగుగాను
వర్ణించనేటికి । వైరాగ్యమునగాంచ
రుధిరమాంసములవి । రూఢినమ్ము
ఇట్టికాయంబతి । హేయమైయొప్పుచు
నళినపత్రంబందు । జలముపగిది
సమయునదెప్పుడో । క్షణభంగురంబౌచు
నింతమాత్రమునకే । యింతలేల
తే॥ గీ॥ జతురనటమూర్తి గో । పాలచక్రవర్తి
నిన్నుభజియించుటేగదా । నిత్యపదవి
లక్కవర....... 83

సీ॥ ధనము తెచ్చువరకె ♦ దారాసుతాదులు
ప్రేమించుచుందురు ♦ ప్రియముగాను
ధనహీనుడగును వృ ♦ ద్ధాప్యంబున నతిని
తలచరునోకరైన ♦ తథ్యముగను
ఉసురు దేహంబందు ♦ నున్నకాలంబె
కుశలంబుగాంతురు ♦ కూర్మిమీర
నినుమంతయాప్రాణ ♦ మెడలినశవమని
భార్యసైతము భీతి ♦ పారిపోవు

తే॥ గీ॥ నిట్టిసంసార గాధనా ♦ కేల నీదు
పాదసేవయెనాకొర్కె ♦ భక్తరక్ష
లక్కవర....... 84

సీ॥ సకలరోగంబుల ♦ సమయజేయును ఘోర
కలిదుఃఖబాధల ♦ నులిమివైచు
భవబంధములబటా ♦ పంచలుగావించు
రాగమోహాంబుల ♦ రాలగొట్టు
కామలోభాదుల ♦ ఖండించబాగుగా
యీషణత్రయముల నెగరగొట్టు
విజయమహాలక్ష్మి ♦ వేగంబెదరిజేర్చు
పారదోలునుమహా ♦ పాపములను

తే॥ గీ॥ కృష్ణనీదివ్యనామసం ♦ కీర్తనములు
నామమహిమను వర్ణించ ♦ నాకువశమె
లక్కవర:..... 85

సీ॥ వేదశాస్త్రపురాణ ♦ విద్యలుచదివిండి
మెంతపూజితుడైన ♦ నేమిఫలము
చేరికానసమందు ♦ ఘోరతపోనిష్ఠ
నెట్టినిర్మలుడైన ♦ నేమిఫలము
అష్టభోగైశ్వైర్య ♦ మనుభవించుచు చాల
నిలధనపతియైన ♦ నేమిఫలము
సుతులునుసతులును ♦ హితులునుబాంధవు
లెందరున్ననుగాని ♦ నేమిఫలము
తే॥ గీ॥ అడవిగాచిన వెన్నెల ♦ యట్లుగాదె
ఫలములేదింక నీభక్తి ♦ పదవిలేక
లక్కవర....... 86

సీ॥ జగతిపై మానవ ♦ జన్మంబు శతవర్ష
పరిమితంబునుగాదె ♦ పరగనిందు
నేబదివత్సరా ♦ లెలమినిద్రారూప
మున రాత్రికాలమై ♦ చనునుగాదె
తక్కిన సగముల ♦ త్సరములలో బాల్య
కైశోరకౌమార ♦ కర్మగతుల
నిరువదివర్షంబు ♦ లరుగును కడమ ము
ప్పదివత్సరములందు ♦ పన్నుగాను
తే॥ గీ॥ సతిసుతాదులభ్రాంతిలో ♦ చాలచిక్కి
కామలోభాదులచె నిన్ను ♦ గాంచరహహా
లక్కవర...... 87

సీ॥ కాషాయవస్త్రముల్ ♦ కరమొప్పధరియించి
దండకమండలాల్ ♦ దాల్చువారు
రుద్రాక్షమాలలు ♦ రూఢిగామెడవేసి
ద్వాదశపుండ్రముల్ ♦ దాల్చువారు
నీళ్లలోమునుగుచు ♦ నిర్మలంబిదియని
సవ్యాపసవ్యముల్ ♦ చల్లువారు
కండ్లుమూతలువేసి ♦ ఘనయోగిమానని
యొప్పుగాజపమాల ♦ దిప్పువారు

తే॥ గీ॥ భక్తమందారనీపాద ♦ భక్తులకును
చాలతక్కువయిది శాస్త్ర ♦ సమ్మతంబు
లక్కవర...... 88

సీ॥ పరగనూరేడులు ♦ పరిమితంమరుగాని
నమ్మరాదామాట ♦ సమ్మతముగ
పుట్టినస్థలమందో ♦ పొలుపొందపరదేశ
మందోగుంటనోగుహ ♦ యందోగుట్ట
నోలేక తోటవనో ♦ యుదకమధ్యంబునో
పట్నంబునో లేక ♦ పల్లెయందో
యెప్పుడోయేవేళో ♦ చెప్పుటింతయులేక
చావుసిద్ధంబగు ♦ సత్యముగను

తే॥ గీ॥ గానజలబుద్బుదముసాటి ♦ కాయమనుచు
నిన్నునిప్పుడెస్మరియింతు ♦ నీలవర్ణ
లక్కవర...... 89

సీ॥ ధరనుమకరముఖ ♦ దంష్ట్రిలమ్మాణిక్య
మెచ్చుగాబెకలింప ♦ వచ్చుగాని
నతిభయంకరమైన ♦ యల్లకల్లోలమా
వారధిదాటంగ ♦ వచ్చుగాని
ఘోరసర్పముమెడ ♦ గుసుమదామంబుల
వైచుచుదరిజేర ♦ వచ్చుగాని
విసుకుజెందకనైన ♦ నిసుకలో తైలంబు
దివ్యతరంబుగా ♦ దీయవచ్చు
తే॥ గీ॥ గానిభవదీయ పాదాబ్జ ♦ భక్తిహీను
దేర్పసాధ్యమెయని తోచు ♦ దేవదేవ
లక్కవర...... 90

సీ॥ ధరను మానవజన్మ ♦ మరుదట్లుదొరికిన
పురుషజన్మముగాంచు ♦ టరయనరుదు
పురుషుడై బుట్టిన ♦ పరమార్థమునుగోరు
కాంతసిద్ధించుట ♦ ఘనతరంబు
యాకాంతగల్గిన ♦ నష్టభోగములును
సంతానమబ్బుట ♦ సందియంబు
సంతానముండిన ♦ శాంతసద్గుణములు
వారికబ్బినగదా ♦ వరసుఖంబు
తే॥ గీ॥ అన్నిటికిమిన్ననీదు పా ♦ దాబ్జభక్తి
యున్ననేగాని యవియన్ని ♦ సున్నగాదె
లక్కవర....... 91

సీ॥ నందనందనకృష్ణ ♦ మందరోద్ధారక
మదనగోపాలశ్రీ ♦ యదుకుమార
గోవర్ధనోద్ధార ♦ గోకులసంచార
గోపకులాంబుధి ♦ కువలయాప్త
గోవిందగోపాల ♦ గోపీమనోహరా
గోపరిపాలక ♦ గోపబాల
దేవకీనందనా ♦ దేవేంద్రముఖనుత
దీనజనావనా ♦ దేవదేవ
తే॥ గీ॥ రాధికాలోలగోవింద ♦ రామకృష్ణ
నిన్నునాత్మదలచనేని ♦ నిత్యపదవి
గానకరుణించునన్నింక ♦ ఖండితముగ
లక్కవర....... 92

సీ॥ పోకుండతప్పునే ♦ భువియందుదేహంబు
నెంతబోషించిన ♦ నేమిఫలము
రాకుండదప్పునే ♦ లాభనష్టములును
కానసభూమిలో ♦ గాపకున్న
గాకుండదప్పునే ♦ ఘనభోగభాగ్యముల్
పూర్వజన్మాంతర ♦ పుణ్యవశత
లేకుండదప్పునే ♦ లేములేసిగలును
దైవశాసనమున ♦ ధాత్రియందు
తే॥ గీ॥ గానకర్మానుభవములీ ♦ గాథలేల
నిన్నుమదినమ్మిగొల్చుటే ♦ నిత్యసుఖము
లక్కవర.... .. 93

సీ॥ సుఖముగల్గించును ♦ కోరగలపాల్గాను
ధర్మంబుదెల్పువి ♦ ద్యాధనంబు
సత్కీర్తినబ్బుయా ♦ చకులకొసంగిన
తరగవిడిదియెవి ♦ ద్యాధనంబు
నేయుగాంతంబైన ♦ నెడంకంర్వాణ
సాధకంబగునువి ♦ ద్యాధనంబు
సప్తసంతానముల్ ♦ గుప్తసంపదయును
తాల్మియునిచ్చువి ♦ ద్యాధనంబు

తే॥ గీ॥ గానవిద్వాంసుడై వారి ♦ గానలోల
యనుచునిన్గొల్వ గాదగున ♦ నుదినంబు
లక్ష్మీవర...... 94

సీ॥ అదివిజ్ఞానంబు ♦ నలవడజేయును
విద్యాధనముగాదె ♦ విశదముగను
గురువులకెల్లను ♦ గురువౌచు బరదేశ
విఖ్యాతిడగుగాదె ♦ విద్యవలన
సకలభూమీశ్వర ♦ సకలపరిపూజ్యంబు
మరిగు ప్రథనమన ♦ బరగువిద్య
వరదేవతయునౌచు ♦ బురుషార్థములగూర్చు
విస్మితమార్గంబు ♦ విద్యగాదె

తే॥ గీ॥ అట్టివిజ్ఞానవిద్యదా ♦ నభ్యసించి
భక్తిసీకథలెప్పుడు ♦ పాడవలయు
లక్ష్మీవర....... 95

సీ॥ క్షీరసాగరమందు ♦ శేషశాయిగనుండు
భక్తసంరక్షమాం ♦ పాహిపాహి
కరిరాజపరిపాల ♦ గానలోలాకృష్ణ
పాపవిఖండన ♦ పాహిపాహి
గోవిందవిఠ్ఠల ♦ గోపాలవిఠ్ఠల
పండరీరంగమాం ♦ పాహిపాహి
కస్తూరిరంగశ్రీ ♦ కంతాప్తకేశవ
పరమదయాకరా ♦ పాహిపాహి

తే॥ గీ॥ బాలగోపాలకృష్ణమాం ♦ పాహిపాహి
పరమపదనివాసాశౌరి ♦ పాహిపాహి
లక్కవర...... 96

సీ॥ పరిమళమును లేని ♦ విరులునునార్యులు
లేనిపురంబును ♦ దానమివ్వ
గనులేనికరయుగం ♦ బునుదీపముండని
సౌధంబుసద్భక్తి ♦ చాలలేని
పూజదాలయుగాని ♦ పురుషునిజీవంబు
పగగంగ పతిలేని ♦ భామరూపు
స్థిరముగానుండని ♦ చిత్తంబుయతిదగ
లేనట్టిమఠమును ♦ ధేనువులును

తే॥ గీ॥ లేనిదొడ్డియు చంద్రుడు ♦ లేనిరాత్రి
విధమునీభక్తిలేనియా ♦ యధముబ్రతుకు
లక్కవర....... 97

సీ॥ గురువనబ్రహ్మయె ♦ గురువనవిష్ణుండు
　　　　గురువనరుద్రుండు ♦ గుర్తుగాను
　గురువరుడనగనీ ♦ గుర్తుదెల్పెడివాడె
　　　　యతడెపోబ్రహ్మంబు ♦ నరయమాధి
　సతతంబు సద్గురు ♦ సంప్రాప్తికైనీదు
　　　　పాదముల్గొల్చెద ♦ భక్తితోడ
　సద్గురుముఖమున ♦ సర్వేశనీదివ్య
　　　　సందర్శనంబబ్బు ♦ సత్యగతిని
తే॥ గీ॥ శివుడుగురురూపమునవచ్చి ♦ చెప్పగాదె
　　యనెడినార్యోక్తిపగిదిన ♦ న్నాదరింపు
　　లక్కవర:.....　　　　98

సీ॥ సద్గురు పాదకం ♦ జాతముల్ సేవింప
　　　　కనులేదువైరాగ్య ♦ ఘనసుపదవి
　దేశికు నపాద ♦ తీర్థంబుగ్రోలక
　　　　గానిరాదట్టివి ♦ జ్ఞానమహిమ
　దేశికవర్యుని ♦ దివ్యప్రసాదంబు
　　　　గొనకగల్గునెభక్తి ♦ మననదీక్ష
　సద్గురుబోధార్థ ♦ సారంబుదెలియక
　　　　గలుగునేముక్తియు ♦ ఘనతగాను
తే॥ గీ॥ అల్లుసద్గురుమూర్తివై ♦ యమరుదీవె
　　నీగురూపదేశమెనాకు ♦ నిత్యసుఖము
　　లక్కవర...ఎ...　　　　99

సీ॥ గీతోపదేశంబె ♦ పాతకదూరంబు
కృష్ణార్జునులబోధ ♦ కృపనుగనగ
నుత్తమంబైనస ♦ ర్వోపనిషత్తులే
ధేనువులై యొప్పె ♦ దివ్యముగను
నీధేనువులక్షీర ♦ మేకాంతముగకృష్ణ
పరమాత్మబితుకుచు ♦ పావనముగ
ఖ్యాతియొనున్న శ్రీ ♦ గీతామృతమెపాలు
పరగగోవత్సమన్ ♦ పార్థునకును
తే॥ గీ॥ నిచ్చుచుంటివియాక్షీర ♦ మెచ్చుగాను
ననుభవానందపరులైనా ♦ ఘనసుబుద్ధు
లనెడితమయాజ్ఞనిష్కామ్య ♦ నతులనితి
లక్కవర.... ... 100

సీ॥ పంచకర్తలకును ♦ పంచభూతంబుల
కథపతివై యుండి ♦ యలరుదీవె
పంచతన్మాత్రల ♦ పంచేంద్రియంబుల
కధ్యక్షుడై యుండి ♦ యలరుదీవె
పంచకళానంద ♦ పంచశక్తులకును
నగ్రేసరుండవై ♦ యలరుదీవె
పంచముద్రలకును ♦ పంచవర్ణంబుల
కావలమెలగుచు ♦ నలరుదీవె
తే॥ గీ॥ పంచకోశంబులనుచాల ♦ మించువాడ
పంచనభములపైమించి ♦ బరగుదీవె
లక్కవర....... 101

సీ॥ తల్లిగర్భమునందు ♦ తొల్లితా చదివిన
చదువంతమరచిసం ♦ సారియగుచు
నీషణత్రియమన ♦ నెసగుపాశంబున
గట్టుబడుచు ఘోర ♦ కర్మములను
చాలగాజేయుచు ♦ సద్ధర్మదూరులై
యింద్రియ్యంబులుతన్ను ♦ నీడ్చుచుండ
కాలంబుదీరిన ♦ గాలభటులువచ్చి
గొంపోవనోర్వక ♦ గోలవెట్టు
తే॥ గీ॥ నట్టిబాధలు లేకుండ ♦ నట్టుతెరవు
భవ్యభవదీయపాదాబ్జ ♦ భక్తిగాదె
లక్కవర....... 102

సీ॥ మనుజనకునుగాంచ ♦ మణిరత్నభూషణా
లెన్నిధరించిన ♦ నేమిఫలము
చంద్రహారంబులు ♦ చక్కనౌభుజకీర్తు
లెన్నిశృంగారించ ♦ నేమిఫలము
చందనలేపన ♦ సత్కుసుమాదిక
లెన్నిధరించిన ♦ నేమిఫలము
స్నానసంధ్యాదులు ♦ జపతపంబులునిచ్చ
లెన్నిజేసినగాని ♦ నేమిఫలము
తే॥ గీ॥ పరమభూషణమౌజ్ఞాన ♦ పదవినేర్చి
అంచితంబుగ నిన్నుకీ ♦ ర్తించవలయు
లక్కవర...... 103

సీ॥ భువియందుజీవుండు ♦ పుట్టుటకును వియ
న్మండలమందున ♦ మసలుచుండి
యలసోమసూర్యమం ♦ డలమున దిరుగుచు
మేఘమందునజొచ్చి ♦ మేలుగాను
బిందురూపంబును ♦ బొందిసస్యములందు
జేరిధాన్యంబులై ♦ జీవులకును
ఆహారమైహృద ♦ యాంతరంబునజేరి
శుక్లశోణితగతి ♦ జూడనొప్పి

తే॥ గీ॥ సతిపతులుగూడపిండమై ♦ సతులగర్భ
నరకమునపొరలాడుచు ♦ ధరణిబుట్టి
మసలుచుండుదురదనిదు ♦ మాయగాదె
లక్కవర....... 104

సీ॥ ధరనుపిండోత్పత్తి ♦ వరుసక్రమంబును
వివరింతుసర్వంబు ♦ విశదముగను
పురుషుండు భుజియింప ♦ పగగనీయన్నంబు
హృదయపద్మంబున ♦ పదిలమైన
జఠరాగ్నివలనప ♦ చనమౌచురసముగా
నగుచునునారస ♦ మరయరక్త
మట్టుల మారుచు ♦ నారక్తమేసప్త
వాసరంబులకును ♦ మాంసమగును

తే॥ గీ॥ అట్టిమాసంబుమెదడుగా ♦ నగునుసప్త
ఘస్రములకట్లు నీమాయ ♦ ఘనతవలన
లక్కవర...... 105

సీ॥ ఏడుఘస్రములకు ♦ నెలమియా మెదడట్టు
నెమకలుగా మారు ♦ క్రమముగాను
ఇట్టి శల్యంబులు ♦ నేడుదినములకు
మజ్జయాగదనిట్టు ♦ మజ్జశోణి
తంబగు సప్తది ♦ నంబుల సతులకు
పురుషులకగు శుక్ల ♦ మరయనట్లె
శుక్లశోణితములె ♦ జూడపిండోత్పత్తి
కసికారణంబయ్యె ♦ వనితమగను
తే॥ గీ॥ ప్రేమగలియంగ వింతగా ♦ పిండమమరె
నిక్కమింతయు నీమాయ ♦ నేర్పుగాదె
లక్కవర...... 106

సీ॥ కరమొప్ప స్త్రీయొక్క ♦ గర్భకోశంబున
వికసించియున్నబు ♦ తుకమలమున
పురుషుని శుక్లంబు ♦ పారిపద్మలోచనా
శోణితంబున జేరి ♦ సుస్థిరముగ
నేకమై యొనరంగ ♦ నేకరాత్రికినంత
గుజ్జురూపముగాంచు ♦ గుర్తుగాను
యాగుజ్జు వరికించ ♦ నైదురోజులకును
నీటిబుగ్గయుబోలి ♦ సాటినిలచు
తే॥ గీ॥ దశదినంబులకాబుగ్గ ♦ విశదగతిని
పెరుగునంతంతకంతెను ♦ దరమునందె
లక్కవర...... 107

సీ॥ శేటగాపదునైదు ♦ దినముల కదియెపిం
డాకృతిదాల్చునా ♦ శ్చర్యమలర
నెలమినాపిండమే ♦ యిరువదిరోజుల
కునుగట్టిపడుచుండు ♦ ఘనతపంచ
వింశతిఘనస్త్రిముల్ ♦ వేడ్కనట్లేగగా
మానుషాకృతినొందె ♦ మరియునంత
పంచభూతములావ ♦ రించెనుతమపరి
నొప్పునుశీర్షంబు ♦ నొక్కనెలకు
తే॥ గీ॥ రెండవనెలయందునుగాంచ ♦ పిండమునకు
మొలచుమేదస్సుకరపాద ♦ ములునుఘనత
లక్కవర.... .. 108

సీ॥ వలనొప్పమూడవ ♦ నెలయందు నెముకలు
వెండుత్రికల్మజ్జయు ♦ వివరముగను
మరియునునఖములు ♦ తరువాతిచర్మంబు
నాల్గవనెలయందు ♦ గల్గునంత
సప్తధాతువులును ♦ చక్కగా వెలయుచు
నైదవనెలయందు ♦ నమరునంత
వాక్కునాశికయును ♦ వరనేత్రియుగళంబు
కర్ణములుదయించు ♦ నిర్ణయముగ
తే॥ గీ॥ నంతనాకలిదప్పియు ♦ నరయగల్గు
నంచితముగనీమాయగ ♦ ల్పించునిట్లు
లక్కవర....... 109

సీ॥ ఆరవనెలయందు ♦ నరయంగజఠరాగ్ని
కంఠనాళంబును ♦ కడుపుగల్గు
ఏడవనెలలోన ♦ నేర్పడుపూర్ణమై
జీవప్రవేశంబు ♦ చిత్రముగను
జననిపీల్చెడిశ్వాస ♦ సాహాయ్యమునజీవ
మునుపిండమునచేరి ♦ ముదముమీర
యాగర్భకుహరాన ♦ నాజీవిమూవిపై
గప్పగామెదలను ♦ కదలలేక
తే॥ గీ॥ జననిభుజియించునన్నర ♦ సంబుసార
మారగింపుచుజ్ఞానియై ♦ పెరుగుశిశువు
లక్కవర...... 110

సీ॥ తొమ్మిదెన్మిదినెల ♦ లమ్మగర్భంబున
శిశువట్లుజ్ఞానియై ♦ చెలగుచుండి
మావియన్సంచిక ♦ మాటునజలములో
నిండుగాతోణికిలు ♦ చుండునట్టి
దుర్భరంబైనయా ♦ గర్భకూపమునుండి
తప్పివెల్వడునట్టు ♦ దారిగాన
కడలుచుమాతృభు ♦ క్తాహార జనితతి
క్తామ్లకషాయాదు ♦ లనుభవింప
తే॥ గీ॥ బాధనొందుచునిస్టూర్పు ♦ పలుతెఱగుల
మొర్రక్కినుతిసల్పునీవెనా ♦ దిక్కటంచు
లక్కవర....... 111

సీ॥ ఓపరమేశ్వరా ♦ గోపాలనాకేమి
గతియనిశిశువంత ♦ వెతలబడుచు
లోకంబులోలెక్క ♦ లేకుండమీరిన
జన్మంబులెత్తితి ♦ జగదధీశ
నేను గోరినస్తన్య ♦ పానంబుగాంచగ
సప్తసాగరజల ♦ సమముగాదె
ఎందుగాంచినగాని ♦ యిలనాశ్మశానంబె
పరగనాజన్మభూ ♦ భాగమంత
తే॥ గీ॥ కొండగుహాయందుజిక్కితి ♦ నిందుదయను
గావుమనుచును మొఱపెట్టు ♦ దేవమరియు
లక్ష్మీవర....... 112

సీ॥ యీగర్భనరకంబు ♦ నెప్పుడుదాటుదు
మలమూత్రములయందు ♦ మనగలేను
జన్మరాహిత్యాది ♦ సద్బోధచేగర్భ
నరకకూపమునకు ♦ మరలరాను
ఘోరప్రమాణంబు ♦ గుర్తుతోనిడియుని
యింద్రియార్యాదుల ♦ నెంచిచేసి
పదిమాసములునంత ♦ పదిలంబుగనునిండ
దుర్గంధయుతమిందు ♦ దూటియుంటి
తే॥ గీ॥ గర్భనరకమునందొక్క ♦ ఘడియమైన
నిలుపలేననిశిశువంత ♦ కలువరించు
లక్ష్మీవర ...... 113

సీ॥ అలధనంజయవాయు ♦ విలసనుదోర్త్రియంగ
శిశువధోముఖమగాచు ♦ చిత్రముగను
జంత్రిగాడాడింప ♦ జారినయ్యాబొమ్మ
పగిదినిశిశువట్టె ♦ పడునుభూమి
రెండుహస్తంబులు ♦ దండిగాజోడించి
దండంబునిడుచునీ ♦ యండమరచి
తల్లి యోనితటము ♦ తటుకునసోకంగ
పూర్వసుజ్ఞానంబు ♦ పోయియుంత
తే॥ గీ॥ కావుకావనియేడ్చును ♦ కర్మగతిని
పరగనిదియంతనీమాయ ♦ సరసిజాక్ష
లక్కవర...... 114

సీ॥ అరయగుదమునందు ♦ నాధారచక్రంబు
గణనాధుడధిపతి ♦ ఘనతగాను
ఆరువందలుహంస ♦ లరయంగనర్ణ
నాల్గుదళములచేత ♦ నమరునదియు
లింగంబునందుజె ♦ లంగుస్వాధిష్ఠాన
చక్రంబుదానికి ♦ సాధకుండు
నజుడగునార్వేలు ♦ హంసలర్ణగాగ
నారుదళములచే ♦ నమరుచుండు
తే॥ గీ॥ ఘనతనాభిని మణిపూర ♦ కంబువిష్ణు
డధిపుడారనికనిహంస ♦ లారువేలు
దశదళంబులచక్రంబు విశదముగను
లక్కవర...... 115

సీ॥ హృదయమందునగాంచ ♦ సదమలనాహత
చక్రంబునొప్పునా ♦ చక్రమునకు
రుద్రుడధ్యక్షుండు ♦ రూఢిగాహంసలు
నారువేలాతని ♦ కర్పణమగు
ద్వాదశదళములు ♦ తనరంగనొప్పును
కంఠప్రదేశాన ♦ ఘనవిశుద్ధ
చక్రంబురాజిల్లు ♦ సరవినద్దానికి
జీవుడధ్యక్షుడా ♦ జీవునకును
తే॥ గీ॥ వేయిహంసలు నర్పణ ♦ చేయవలయు
షోడశదళములునునట్టి ♦ శోభనొప్పు
లక్ష్మీవర...... 116

సీ॥ భ్రూమధ్యమంబున ♦ పొసగుచునాజ్ఞేయ
చక్రంబునొప్పును ♦ సరసముగను
నధ్యక్షుడీశ్వరుం ♦ డొచు హంసలువెయ్యి
ద్విదళములునుగల్గి ♦ దివ్యముగను
బ్రహ్మరంధ్రంబందు ♦ పరగసహస్రార
చక్రంబుశోభిల్లు ♦ సత్యపదవి
నెలమిసహస్రహం ♦ సలు నర్పణంబట
సద్గురుమూర్తికి ♦ శాశ్వతముగ
తే॥ గీ॥ వేయిరేకులపద్మంబు ♦ విశదగతిని
కోటికోట్యర్కసత్కాంతి ♦ ధాటినలర
వెల్గుచుండునుపరమాత్మ ♦ వేడుకలర
లక్ష్మీవర...... 117

సీ॥ ఆరుచక్రములందు ♦ ననిలమానసముల
తోనెనసియుహంస ♦ మానకెపుడు
పరగనహర్నిశ ♦ మరయంగహంసోహ
మన్‌శబ్దమునచాల ♦ మహిమతోడ
శ్వాసనిశ్వాసగ ♦ చరియించునిరతంబు
నిదియోగవిదులచే ♦ నెరుగదగును.
నిదియెయోంకారంబు ♦ నిదిప్రణవబ్రహ్మ
సూత్రంబుబుధసేవ్య ♦ సుస్థిరంబు
తే॥ గీ॥ లీలచేనిరువదియొక్క ♦ వేలయూరు
నూరుమారులు విహరించు ♦ మేటితోడ
లక్కవర....... 118

సీ॥ బట్టబయల్వర ♦ బ్రహ్మంబునందున
ఆకాశమునుబుట్టె ♦ నరయనిట్టి
యాకాశమునబుట్టె ♦ నగ్నియునీయగ్ని
యందునగాంచంగ ♦ నప్పుబుట్టె
నీయప్పువలనను ♦ నిలగల్గెమరియున
య్యిలయందునోషధుల్ ♦ నెలమిపుట్టె
నోషధులందున ♦ నొనరనన్నముపుట్టె
నీయన్నమునగాంచ ♦ నెనుబదియును
తే॥ గీ॥ నాల్గులక్షలజీవులు ♦ గల్గెడగతి
నాయెనీరీతిసృష్టినీ ♦ మాయవలన
లక్కవర:..... 119

సీ॥ జీవుడహంకార ♦ చిత్తమనోబుద్ధు
లంతరింద్రియములై ♦ యలరునైదు
ప్రాణమపానము ♦ దానసమానముల్
వ్యానంబుననుపంచ ♦ వాయువులును
జ్ఞానేంద్రియములగు ♦ చక్షువుశ్రోత్రంబు
జిహ్వాఘ్రాణముత్వక్కు ! వెలగునైదు
శబ్దరూపరసముల్ ♦ స్పర్శముగంధంబు
పంచతన్మాత్రలై ♦ బరగువాక్కు
తే॥ గీ॥ హస్తపాదపాయూపస్థ ♦ లనగనివియు
పంచకర్మేంద్రియములన ♦ బరగునిట్లు
పంచవింశతితత్వముల్ ♦ మించియుండు
లక్కవర........ 120

సీ॥ సాంఖ్యయోగముగుర్తు ♦ సాధించుమనుజుండు
సమరసానందాఖ్య ♦ సాధకుండు
తారకయోగంబు ♦ తెరచుచుపరమార్థ
తత్వంబునెరిగిన ♦ తత్వవిదుడు
అమనస్కయోగంబు ♦ విమలసుజ్ఞానాత్మ
ఘనుడగుననుభవ ♦ జ్ఞానపరుడు
సాంఖ్యతారకములు ♦ చక్కగానమనస్క
యోగంబునెరిగిన ♦ యోగిగాంచు
తే॥ గీ॥ తనరనీవిశ్వరూపసం ♦ దర్శనంబు
అదియెగాదెబ్రహ్మానంద ♦ మనగబరగు
లక్కవర:...... 121

సీ॥ పంచముద్రిలసూటి ♦ పరగశోధించియు
నాదబిందుకళల ♦ నాణ్యమెరిగి
షడ్చక్రములయందు ♦ చరియించుహంసను
భ్రూమధ్యమందున ♦ బొందుపరచి
లయముగావించెడి ♦ లక్ష్యార్థమునతాను
తన్నుతానైయున్న ♦ తలపునెరిగి
నెలమినాపోజ్యోతి ♦ నేననుతత్వంబు
గురుముఖంబునగాంచు ♦ గుర్తునిదియె
తే॥ గీ॥ పరమతారకయోగంబు ♦ పగలురాత్రి
తరచితత్వంబుగనుచెపో ♦ పరమయోగి
లక్కవర...... 122

సీ॥ నిర్వికారానంద ♦ సర్వజీవావాస
నిశ్శబ్దనిష్కర్మ ♦ నిర్గుణాత్మ
నిరతిశయాజగ ♦ న్నిర్ణేతనిరుపమ
నిత్యశుద్ధజ్ఞాన ♦ నిర్వికల్ప
నిర్విశేషామహా ♦ నిర్మలగుణయుత
నిర్లేపయీశ్వర ♦ నిష్ప్రపంచ
నిర్వచనాసర్వ ♦ నిర్ణయనిరవయ
నిరుపద్రవానిత్య ♦ నిర్మలాత్మ
తే॥ గీ॥ ఆదికారణసకలవి ♦ శ్వాండరూప
నిగమగోచరపరమాత్మ ♦ నిష్కళంక
లక్కవర...... 123

సీ॥ విశ్వేశ్వరాఖ్య ♦ త్రైశ్వైర్య సంధాయి
విశ్వసురాధిప ♦ విశ్వనాథ
విశ్వరూపేశ్వరా ♦ విశ్వమోహనరూప
విశ్వజీవాధార ♦ విశ్వకర్త
విశ్వకారణగుణ్ణ ♦ విశ్వేశయీశ్వర
విశ్వలోకాధిప ♦ విశ్వదాత
విశ్వపరిభూపర ♦ మేశ్వరసర్వేశ
విశ్వముఖావాస ♦ విశ్వమూర్తి
తే॥ గీ॥ విశ్వసాక్షివిస్వామివి ♦ విశ్వమయుడ
భక్తహృత్పద్మసంవాస ♦ ధర్మవాస
లక్కవర...... 124

సీ॥ దానధర్మక్రియా ♦ తపజపంబులునీదు
స్మరణకుసమముకా ♦ జాలవెంత
తీర్థయాత్రిలువ్రిత ♦ దీపదానాదులు
నీనామభజనకు ♦ గానవీడు
యజ్ఞయాగాదులు ♦ నష్టభోగాదులు
నీనామచింతకు ♦ గానవీడు
సకలపురాణముల్ ♦ సంధ్యాదిసత్క్రియల్
నీనామనుడులకు ♦ గానవీడు
తే॥ గీ॥ పరమపావనమంగళ ♦ ప్రదముగాన
నామమహిమనువర్ణించ ♦ నాతరంబె
ధరనువేంకటరత్నాఖ్య ♦ దాసపోష
లక్కవర...... 125

సీ॥ ఇంపైనయీనూట ♦ యిరువదియెన్మిది
మహనీయపద్యముల్ ♦ మౌక్తికములు
పావివిశ్రమములు ♦ బంగారుకోలుకులు
కూర్మిశబ్దంబులు ♦ గూర్పుటయును
పరమతత్వార్థము ♦ పచ్చలపతకంబు
నీయంకితంబను ♦ మేరుపూస
యీరీతిమౌక్తిక ♦ హారంబునే జేసి
ముదముతోనర్పించి ♦ మొ్రక్కులిడితి
తే॥ గీ॥ నందగోపాలనీకంఠ ♦ మాదుమిరయ
నన్నురక్షింపునినుసదా ♦ నమ్మియుంటి
లక్కవర....... 126

సీ॥ నెల్లూరుజిల్లాను ♦ కుల్లూరుపురమందు
జననమందితిబహు ♦ ఘనతగాను
బ్రహ్మవిద్యానంద ♦ పావనచరితులౌ
బలిజలందురుకుల ♦ పద్ధతులను
ఎన్నలక్కాకుల ♦ యింటిపేరందున
రామచంద్రాఖ్యుడౌ ♦ రమ్యయశుడు
అతనికాంత యరుక ♦ లాంబ యామిధునంబు
గనిరినన్ సుతునిగా ♦ గానలోల
తే॥ గీ॥ పేరువేంకటరత్నమౌ ♦ సారసాక్ష
భక్తినీకిత్తుకాన్కనీ ♦ పద్యమాల
లక్కవర ...... 127

సీ॥ యీదివ్యశతకంబు ♦ నెవ్వరువిన్నను
వ్రాసిచదివినట్టి ♦ వసుధజనులు
ధర్మార్థకామముల్ ♦ తత్వార్థసుజ్ఞాన
మాయురారోగ్యంబు ♦ అష్టభోగ
ములను పొందియుఘన ♦ మోక్షమందియుకృష్ణ
సన్నిధినుందురు ♦ సత్యముగను
నీరంబువదలియు ♦ క్షీరంబునొందెడి
హంసపోలికనువి ♦ ద్వాంసులెల్ల
తే॥ గీ॥ తప్పులన్నియుసవరించి ♦ యొప్పులుగను
దయతొమన్నించుడీనాదు ♦ దాసుడనుచు
లక్కవర....... 128

సీ॥ గోపాలశ్రీకృష్ణ ♦ గోపరిపాలకా
మందరనగధీర ♦ మంగళంబు
నీరజదళనేత్ర ♦ నీలతోయదగాత్ర
మానినసన్నుతపాత్ర ♦ మంగళంబు
పాండవపాలనా ♦ భక్తజనోద్ధార
మదుసూదనాశౌరి ♦ మంగళంబు
కమలామనగఖేల ♦ కాంచనమయుచేల
మహనీయగుణశీల ♦ మంగళంబు
తే॥ గీ॥ మన్మధాకార యదు ♦ వీర మంగళంబు
మాధవానంతగోవింద ♦ మంగళంబు
లక్కవరపురపాలహి ♦ రణ్యచేల
వేణుగోపాల రుక్మిణీ ♦ ప్రాణలోల 129

శతకము సమాప్తము

## గద్యము.

ఇది శ్రీమత్సరస్వతి నిర్హేతుక జాయమానకటాక్ష
వీక్షణాపవిత్ర శ్రీపైడిపాల్గోత్ర సనాతనమత
శ్రీ లక్కాకుల వంశపయః పారావార
రాకాసుధాకర రామచంద్రాగ్య
యరుక లాంబా సత్పుత్రవిబుధ
విధేయ శ్రీభగవత్కవిం క
టరత్నాఖ్య దాస భక్తిజ్ఞా
న వైరాగ్యానందసుబోధ
కరంబగుశ్రీమత్ లక్క
వరశ్రీవేణుగోపాల
శతకముసర్వము
సంపూర్ణము.

ఓమ్ సర్వేజన సుఖినోభవంతు
హరిః ఓమ్ తత్సత్ శాన్తి శాన్తి శాన్తిః
శ్రీకృష్ణార్పణమస్తు.



